# ఈ నాటకమున వచ్చు పాత్రలు.

### ప్రథమాంకము.

1 సూత్రధారుఁడు.
2 నటి.
3 ధర్మరాజు.
4 భీముఁడు.
5 అర్జునుఁడు.
6 నకులుఁడు.
7 సహదేవుఁడు.
8 ద్రౌపది.
9 ధౌమ్యుఁడు.

### ద్వితీయాంకము.

1 పాండవపంచకము.
2 ద్రౌపది.
3 ధర్మదేవత.

### తృతీయాంకము.

1 అతివినయుఁడు. } సేవకులు.
2 ప్రియంవదుఁడు }
3 కీచకుఁడు.
4 మాలిని.
5 సుధేష్ణ.

### చతుర్థాంకము.

1 సుశీల. } కీచకుననుచారిణులు.
2 చారుమతి. }
3 విరటుఁడు.
4 కంకభట్టు.
5 దామగ్రంథి.
6 తంత్రీపాలుఁడు.
7 మల్లుఁడు.
8 పారిపార్శ్వకుఁడు.
9 వలలుఁడు.
10 మాలిని.
11 కీచకుఁడు.

### పంచమాంకము.

1 భీముఁడు.
2 ద్రౌపది.

### షష్ఠాంకము.

1 కీచకుఁడు.
2 భార్య.

### సప్తమాంకము.

1 కీచకుఁడు.
2 ద్రౌపది.
3 ధర్మరాజు.
4 భీముఁడు.
5 అర్జునుఁడు.
6 నకులుఁడు.
7 సహదేవుఁడు.

## జాతకమార్తాండము.

### రెండవభాగము.

ఇది అచ్చుపూర్తియై సిద్ధముగానున్నది. ఇది 320 పేజీలుగల గ్రంథము. దీనియందు లగ్నస్ఫుటము, గ్రహస్ఫుటము భావస్ఫుటము షోడశవర్గ అష్టకవర్గ షడ్బలములు తాత్పర్యములతోను విశేషాంశములతోను సుమారు 1000 శ్లోకములుగల ద్వాదశభావఫలములును, మహాదశాంతర్దశాఫలములు మొదలగు ననేకసంగతులు మిక్కిలి అత్యద్భుతముగా వ్రాయబడినవి. ఈగ్రంథము నచ్చనియెడల తిరిగి సొమ్ము వాపస్ చేయుదుము. దీనివెల పోష్టుఖర్చులుగాక రు 2—0—0

## సరస్వతి.

(Commody of Errors.)

ఇది శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారి చేతను వ్రాయబడిన పదియంకముల కల్పితనాటకము. సాక్షి మొదలగు పెక్కుగ్రంథములను వ్రాసిన వీరిశైలినిగూర్చి విశేషించి వ్రాయనవసరము లేదు. ఈనాటకము జదువ మొదలిడినచో తుదివఱకు జదివినగాని తోచదని మాత్రము చెప్పగలము. వెల 1—0—0

## జాతకమర్మబోధిని.

---

బ్రహ్మశ్రీ కాలనాథభట్ట వేంకటరమశాస్త్రి ప్రణీతము. జ్యోతిష మభ్యసింపగోరువారు నీగ్రంథమును పఠించిన ద్వాదశభావములును కరతలామలకముగా తేట తెల్లమగు ననుట కావంతయు సంశయము లేదు. అనేకగ్రంథములనుండి వివిధాంశములు విపులముగా పెక్కుగ్రంథములు జదువనవసరము లేకుండునట్లును జనసామాన్యమున కుపయోగముగా నుండునట్లును తేటతెల్లముగా నుదాహరణములతో వ్రాయబడినది. వెల 1—0—0

వలయువారు:—గోదావరీ బుక్కుడిపో, రాజమండ్రి. అని వ్రాయవలెను.

శ్రీశారదాంబాయైనమః.

# కీచకవధ.

నాంది.

శా. శ్రీలజ్జెన్నగు రాజ్యభారముఁ బిత్ర ♦ పేరేపణన్వీడి యే
వేళం బత్నియు సోదరుఁడుఁ గొలువ ♦ బెన్గానకుంబోయి యం
దాలింగోల్పడి శాత్రవున్దునిమి భా ♦ ర్యాయుక్తుఁడై రాజ్యల
క్ష్మీలోలుండయి లోకముల్మనుపు నా ♦ శ్రీరాముఁడో మున్మమున్.

నాంద్యంతమున సూత్రధారుఁడు (పుష్పాంజలి జల్లుచున్నాఁడు.)

సూ—(స్వగతము) నటి నేఁడేలకో తడవయ్యెను జాగుఁ జేయుచున్నది. ఏఁదియే నొక్కయిక్కట్టునం జిక్కుపడలేదు గద. మన లుటకుం గతమేమి. (ప్రకాశముగా)

క. మదవతి సురూపిణియై
న్మదినప్రియమూఁదదాని ♦ సగడేవఁబడున్
మృదువగుసోయగ మొదవిన
మదిమదిఁజెలుపంగఖలుఁడు ♦ మదిబ్రియమూఁదున్.

కావున విగమ్మున భామినులకుఁ జెలువంబున్నను లేకున్ననుఁ గూడ ననర్థంబుగదా. (తెఱవంకఁ జూచుచు నటీ అని పిలుచును.)

(నటి ప్రవేశించి)

నటి—నన్నేల యింతబిగ్గరగా బిలచితిరి? నాకష్టముల నెప్పటికి నే ననుభవించుచుండవలసినదేగదా?

సూ—(స్వగతం) ఏమిది? నేఁడు నటి విషాదముతో నున్నటు లున్నది. (ప్రకాశముగా) నటీ! ఏమీ నేఁడిట్లనుచుంటివి? జరిగినవృత్తాంతముఁ దొలుతఁ జెప్పి నే నుదాసీనుఁడ నైనచో పిదప నీవేమనినను సరి

తముగాని ముందుగా నిట్లనెద వేల? నేఁడింత యాగు సేయుటకుం గతే
మేమొ జెప్పుము.

నటి—క. పెరవారి కంటఁబడుటయె
దురితంబని యెంచి యెందుఁ ♦ దోఁచక యున్నన్
దెరపి గొని యెక్కు ఖుఁడిదె
మరులూని పరాభవింప ♦ మరిమరి పిరుగన్.

(అని యేడ్చుచున్నది.)

సూ—(స్వగతం) నేఁసుకొనినట్లె యయినది. (నటిచేయి బట్టు
కొని, ప్రకాశముగ)

గీ. నాతి నీపై మరుల్గొన్న ♦ ఘాతుకుండు
నేఁడుఁ జూడంగ బ్రతికెడు ♦ వాఁడుఁగాఁడు
అగ్నికీలను నెరయని ♦ యాత్మనెంచి
మిడుత బడునేని ప్రమాదక ♦ మిగులగలదె.

నటి—నాథా! మాటలయందుఁ జేవతనమా! ఎన్నడును లేదు.

సూ—సమయముఁగాదని నీవెఱిఁగియుండియును నన్నలయిం
చెద వేల? యిరామూరు మారాడిన మీయన్న దోడుసుమా.

నటి—సరి సరి చాలును. మాయన్న మిమ్మేమి జేసె. పెట్టుమ
నెనా పోయుమనెనా? ప్రాణేశ్వరా! మీకింతకోపమేల! నన్నింతతొంద
రగాఁ బిలుచుటకుం గతం బానతిండు. ఆలస్యమునకు క్షమింపుడు.

సూ—నటీ! నేఁడు మనసభికులందఱునుఁ గీచకవధయను నాట
కము నభినయింపవలసినదిగా నాజ్ఞాపించిరి.

నటి—నాథా! అట్టినాటకము నెవరురచియించిరో కొంచెము
దెలియఁజేసి వివరించెదరా?

సూ—

సీ. సతతాన్నదాన వి ♦ శ్రుతయశశ్శాలి వేం
కనమంత్రిపూజ్య ♦ వ్యానికి దాత

కరుణాసుధారస ♦ సరసీమరాళమ్ము
బాపిరాట్ప్రభువు డె ♦ వ్వానికిఁ దండ్రి
పతిసేవనానిర ♦ పాయమతి మహాల
క్ష్మమ్మ యెవ్వానికిఁ ♦ గన్నతల్లి
పరవధూవిముఖుండుఁ ♦ బరహితాభిముఖుండు
నెట్టిమరాజుపే ♦ త్రృప్యుఁడెవని

గీ. కతఁడు నిశ్శంకలాన్వవా ♦ యావతంస
మాంధ్రపద్యాద్యనవద్యకా ♦ వ్యప్రణేత
బుధవిధేయుండు నగు కృష్ణ ♦ మూర్తినామ
ధేయుఁడు రచించెఁ గర్ణర ♦ సాయనముగ.

నటి—నాథా! యిదివఱకు మనము మంచివనియెంచి ప్రదర్శించునవియును సభికు లంగీకరించినయవియును నాటకము లనేకములుండ నీనూతననాటకము నభినయించి నేఁడీసామాజికుల నానందింపఁ జేయఁగలమా?

సూ—నటీ! సందేహ మేల.

క. కవియు న్నవీనుఁడగుఁ ద
త్కవితయు నూతనమటంచుఁ ♦ దలపకుమీ ప్రౌం
జవరాలి ప్రథమసురతము
నవునవు నని సరసు డాత్మ ♦ నలరుట లేదే.

నటి—(సిగ్గుతో తలవంచుకొనును.)

సూ—నటీ! ఈసభ దోషజ్ఞులగు పండితమండలిచే పరిష్కృతం బగుటంజేసి—

ఉ. అరయ నెన్నొ నాటకము ♦ లాడి యశంబును గొంటి నీసభా
స్తారులుఁ గోరుఁ గీచకవ ♦ ధ ప్రకటించెదుఁబట్ల నాకుఁ గాం

తారనివాసముం గడపి ♦ ధర్మజుఁ డింకొక యేఁడు గూఢసం
చారముఁ జేయఁగా మదివి ♦ చారముఁ బొందినభంగిఁ దోఁచెడున్

(తెరలో)

మ. పదిరెండేఁడులు ఘోరదుర్గమవనా ♦ వాసమ్ము మే మున్నవ
భ్యుదయమ్ము న్మదిఁ గోరి సేవకులు సం ♦ బోధింప స్వస్తుల్బుధు
ల్గదురొప్ప న్బతియింప మీరనువదిం ♦ పం జెల్లె నజ్ఞాతవా
సదశావత్సరమింక మాకు దరియించ ♦ న్శక్యమొక్కోక దే.

సూ—నటీ! అజ్ఞాతవాసము నెట్లువిస్తరించుదుమో యః యపాస్తధైర్యసారుండై ధర్మరాజువేషమున మాబావ యవనికాంతరమునకు వచ్చియున్నవాఁడు. నీవును వేగఁబోయి తగిన వేషంబలవరించుకొనుము. (ఇద్దఱును నిష్క్రమించిరి.)

ప్రస్తావన.

---

(రంగము—ద్వైతవనము)

[ధర్మరాజు, భీముఁడు, అర్జునుఁడు, నకులుఁడు, సహదేవుఁడు;
ద్రౌపది, ధౌమ్యుఁడు ప్రవేశించుచున్నారు.]

ధర్మ—(పదిరెండేఁడులు అనుపద్యమునుఁ జదువును)

ఉ. కౌరవులీరసమ్మున నొ ♦ కానొక తప్పుఁ గణింపకమ్మయి
న్వైరము పెంచి జూదమున నె ♦ పమ్మున రాజ్యముఁ గొల్లఁబుచ్చి కా
తారనివాసుల న్మము నొ ♦ నర్పఁగఁ గంటికి ఱెప్పభంగిగా
నీరును మీరు మమ్మనున ♦ యింపుగఁ బుచ్చితి మిన్ని నాళ్లటన్.

క. ఎవ్వరికిఁ దెలియకుండఁగ
నెవ్విధిఁ జరియింపఁదగు మ ♦ హీసురవర్యా
మవ్వమ్ముగలుగుఁ దమ్ములు
నివ్వనితయు మరుఁగు వడఁగ ♦ నెందలవడెదున్.

ఉ. ఇమ్మహిళావతంసము న ♦ హీనపరాక్రమ ధన్యులైన యీ
తమ్ములును నృహాస్యచరి ♦ తమ్ముల నుండఁగ నేర్తురెట్లు ని
త్యమ్మును వేచియుందు రభి ♦ యాతులు వారలెఱింగిరే నపా
యమ్మునటించునంచు హృద ♦ యమ్ముభయమ్మధికమ్ము గ్రమ్మెడున్.

భీము—(డిగ్గున లేచి మహాకోపముతో) అన్నయ్యా!

క. తమకేలా చింతిల ద్రౌ
ణములీ యెడలందు భీము ♦ నకునుండంగా
క్షమియించి సెలవొసంగిన
నిమిషములో వంతలెల్ల ♦ నీరుగఁ జేతున్.

(గద రెండుచేతులఁ ద్రిప్పుచు)

మ. కదనోర్వీస్థలి నంత్యకాల భుజగ ♦ గ్రైవేయ ఘోరాకృతిన్
గదసారింపుచు ధార్తరాష్ట్రశతము ♦ ఖండించి యేమెక్కడన్
త్రిదశుల్మెచ్చఁగ నేడు నీవలన ధా ♦ త్రీభాగమేలింతు న
య్యదిగాకుండిన నేనుఁ దమ్ముఁడను గా ♦ నంచుందలంపన్వలెన్.

తమ్ములారా! మీరిందుండుఁడు; నావెంటనెవ్వరును రావలదు. నేనొక్కండనె గదైకసహాయుండనై వైరినిర్మూలనం బాచరించెద. పోయి వచ్చెద (అని పోవుచున్నాఁడు)

అ—అన్నయ్యా! ఏమి యీతొందర! పెద్దల యనుజ్ఞయైనఁ గొనవలదా! కొంచెము సేపు తాళుఁడు.

ద్రౌ—ప్రాణనాథా! మీమనంబెంత ధైర్యసాహసోదారంబయిన నీపట్ల మీయన్నగారు మీకనుజ్ఞ యిత్తురను మాటమాత్రము బుట్టదు.

అ—(స్వగతము) ఈయన కీమెకూడ తోడ్పడుచున్నదే. (ప్రకాశము) అన్నయ్యా!

శా. ఈలోకమ్మున నిన్నుఁ బోలు మగవాఁ ♦ డే లేడు చూడంగ నీ
వాలాపమ్ముల కిద్దిగాదు సమయం ♦ బన్నయ్య మన్నించి లోఁ

దాళఁగావలెఁ గొంతకాలమొక చం ♦ దముఁబొంది ప్రచ్ఛన్నత
న్మెలఁగ బాడరె శాత్రవు లసూయయు ♦ న్మెలఁగ నీకొప్పునే.

ధ—ఈలోకమ్మున ననెదవేల తమ్ముఁడా, యితనితో సరివా డేలోకమ్మునను లేఁడు.

అ—సందేహమేమి? అన్నయ్యా! వైరులకు భయపడి నేనిట్లనుచుంటినని తలంపకుఁడు. ప్రతిజ్ఞాభంగంబు సేయుట మనవంటివారికి ధర్మవిరుద్ధంబని విన్నవించితిఁ గాదేని సంగరంబునన నీతమ్ములలో వెనుదీయువాఁడెవఁడు? దుర్వారాతిగర్వాంధకార సహస్రాంశులగు నాశ్వినేయులు నసదులే, నేనంత పిఱికివాఁడనే.

భీ—(కోపముతో నగ్రజునితో బలుకఁబోవును)

ధర్మ—

ఉ. పట్టితి నొక్కటే ప్రతిన ♦ భంగముసేయుట ధర్మహీనము మీ
కెట్టెటు కష్టమైన సహి ♦ యించితిరాగతి నిప్డు కాదనన్
గట్టిగ బ్రువ్వఁదిట్టరె జ ♦ గమ్మున నన్నును రాజ్యలక్ష్మి చే
పట్టుటఁ జేదె పాండుమహి ♦ పాలు యశంబును నిల్పుటొప్పదే.

తమ్ముఁడా! సమయభంగమ్ము గాకుండుటకై కాదె యిప్పుడు నీ జవ్వనితోఁ గూడ వనవాసాయాసంబనుభవించితిమిగాని కౌరవ్యులొనరించు దుర్ణయమ్ములకుఁ బ్రతిక్రియఁ జేయలేమనుభయమునఁగాదు సుమా. ప్రతిజ్ఞ చెల్లించినచో దైవము బనుకూలుండగు దానంజేసి శత్రుసంహారమును సులభసాధ్యంబగును. గాన నీయొక్క యేడునెలం గూడ సహించి నాకొఱకై చెల్లింపుము తమ్ముఁడా!

భీ—కౌరవులు దుర్ణయులనుటను మాత్రము సమ్మతించితిరా; నయమే.

ఉ. పాయనికిన్కఁ గౌరవులు ♦ బాల్యముఁదొట్టి యొనర్చుఁగీడుల
న్యాయము గాదె చూడు మొక ♦ దైవఁ బ్రతిక్రియఁ జేయనిచ్చినా

వే యొకకూళ యీసభను ♦ బెండ్లము క్రొమ్ముడిఁ బట్టియీడ్వఁగా
నేయనదూరకుండుఁ గని ♦ యీమనమే పురుఁ దక్క ధర్మజా.

అ—(భీముని చేతులు పట్టుకొని) అన్నయ్యా! వనవాసాయాస క్లేశితులగు నన్నగారి నీనిష్ఠురోక్తులచేఁ జాలిం బెట్టదగునే అంతయుఁ జెల్లె గదా యికనొక యేఁడుగూడ నెండ్లైన దలదాచికొని కన్నులు మూసికొనినచో నన్నియుం జక్కఁబడును. నావిన్నపమాలించి ముందు ప్రయత్న మూహించుఁడు.

భీ—అర్జునా! యెంతి వెఱ్ఱివాడవోయి. నీవు చెప్పిన యట్లు లీసం వత్సరము గూడ నెట్లనో కాలక్షేపము జేయుద మనికొనిన కడపట నేదియో మరియొక ప్రతిబంధ మప్పటికిఁ దటస్థించును. కానిమ్ము తమ్ముడా! మీకందఱికి లేనినొప్పి నాకేల! ఆమర్మాగ్ర్యుల చెయ్వులు మనమున నంటియున్నవి గాన నన్నూరుకొననీవు. ఇదిగాక నేను మాత్రము సమయభంగంబైన సైరింపగలనా! ఇంక నాదుష్టుల తలంపు జేయకూరకుండెద. (కొంచెము సేపూరకుండి) తమ్ముడా! మదిఁగోపము వోయి తాపమే జూపుచున్నది. (లోలోపల విచారించును.)

అ—అన్నయ్యా యేమని విచారించెద రేల.

భీ—అహా! ధర్మరాజు మహానుభావుండు, సమాప్త రాజసూయుండు, అనసూయుండు. ఆహా (విచారించును)

ధ—(విచారించును)

ధౌ—(వారించుచున్నాఁడు) ధర్మరాజా! నీవుగూడ నిట్లు విచారించెదవా? ఇటువినుము—

ఉ. శాసిత ధర్మవర్తనుఁడు ♦ శాంతియుఁ దాంతియుఁ గల్గువాఁడు ని
ష్కాసిత దుష్టశాత్రవుఁడు ♦ కల్మష దిత్రిచరిత్రుఁడు సదా
భ్యాసితనిత్యకర్ముఁడుదా ♦ రుఁడు ధర్మజుఁ డొక్కఁడున్నయీ
వాసియు పన్నెయుండదోపఁగఁ ♦ బాడియె యీగతిఁ జింతఁబొందగన్.

ఉ. ఒక్కొకకాలమందుఁ ద్రిది ♦ వౌకసులున్రిపువిక్రమక్రమ
న్యక్కృతులై మహావిభవ ♦ మాసనయొనర్పక గూఢవృత్తిమై
స్రుక్కుచు ఖిన్నచిత్తులగు ♦ చున్దరుణమ్మును వేచిరిమ్మర
వ్రిక్కాని శత్రుసూదనము ♦ నన్గడు ధన్యతఁ గాంచరే నృపా.

క. కాలమది యొక్క విధమున
వాలాయముఁ గాదటంచు ♦ భావించుచు న
చ్ఛీలంబుగలుగు విబుధులు
జాలిం బడరెందు, గష్ట ♦ సమయము లందున్.

శా. శౌర్యాంకుక్కరి తల్లిమూపునయుం ♦ దానాసముం జేసె నా
గీర్వాణాధిపుఁ డమ్మెయి న్నిషధకు ♦ తీర్కలమ్మునం డాగె న
స్తార్వాండౌక్కడ ధేనుగర్భగతుఁడై ♦ యజ్ఞాతచర్యావిధు
ల్బర్వన్గొండొకకాలముండె రిపుల ♦ న్భంజింపరే క్రిమ్మరన్.

గీ. సకలజనులకుఁ గష్టము ♦ ల్కాశ్వతములె
సమయభంగంబుఁ గాకుండ ♦ జరుపవలయు
ధర్మరతుఁడవు నీయందుఁ ♦ దప్పులేదు
గురుకులంబున బాపంబు ♦ కొల్లయయ్యె.

ధర్మరాజా! యివియన్నియు నూరక బోవునా, ఆపదలుఁ గావురములుండునా, నీవెఱుంగని ధర్మములుం గలవె, నీవు సహజధార్మికుండవగుటయునుఁ గౌరవులొనర్చిన దుష్టచేష్టితమ్ములును లోకమ్మున కెఱుకపడదె, వారలొనర్చిన దురితమ్ములు వారలఁ గట్టికుడుపక పోవు. మీఱింక వగపుడిగి సమయానుకూలవ్యవసాయమ్మునకుఁ గడంగుఁడు.

భీ—(విచారించుచు.)

మ. చతురంభోనిధిముద్రితావనిరిపు ♦ క్ష్మానాథులం గెల్చి ని
ష్ప్రతిపక్షంబుగ రాజసూయమును య ♦ జ్ఞంబొప్పగాఁ జేసి ఱ

ప్రతిమానుండని పేరుఁగాంచినఘన ♦ ప్రజ్ఞుండు మాయన్న యే
గతిఁగావించునో యన్యసేవనమొకో ♦ గనాఁడు నాకింతయున్.

ధ—తమ్ముఁడా! నాకొఱకా నీవు విచారించుచుంటివి. ఇటువినుము.

సీ. సన్యాసినై రాజ ♦ సభకు నేఁజనుదెంచి
విరటునిఁ బొడగాంచి ♦ పేర్మిమించి
జ్యోతిషికస్మార్త ♦ శ్రౌతశాకునికమ్ము
లందుఁ గల్గిన రహ ♦ స్యమ్ములెంచి
యఖిలపురాణేతి ♦ హాసంబులందొప్పఁ
బద్ధతులెల్ల యు ♦ పన్యసించి
జూదంబు నాడంగ ♦ మోదంబుఁబుట్టించు

భీ—అన్నయ్యా! యిదియె మనల నడవులపాలుజేసి యింత పనికిఁదెచ్చినది.

ధ— నామనక్షంబుల ♦ న్గాఁకపించి
గీ. మెప్పు వడయుదు గరువమ్ము ♦ దప్పకుండ
ధర్మసుతునకు సభ్యుఁడై ♦ నెనరువాఁడ
కంకుభట్టను నామమ్ము ♦ గలుగువాఁడ
ననుచు వచియింతు నృపునకు ♦ నన్నడిగెనేని.

మ. ఒకఁడే కాలెడులక్క-యింటమనుజా ♦ కుండంగఁ గొంపోయెనా
బకునింగూల్చి యేకచక్రనగరీ ♦ వాస్తవ్యులం బ్రోచెఁ బూఁ
నికఁగిమ్మీరహిడింబవాళ్ళులఖుం ♦ డించెన్భుజాశక్తి నా
యకుమారుండిలఁ జెల్వుఁడే యలతిచె ♦ య్యాల్సేయ నట్లోర్చునే.

తమ్ముఁడా యీయిడుమలన్నియు నీకు నాచేబొడమినవి గదా.

భీ—మీరు నిమిత్తమాత్రము; అన్నయ్యా! మీజ్ఞేమిచే

యుదురు. మాకర్మమిట్లున్నది. విచారించిన ఫలములేదు. నాకొఱకు మీరింతగావిచారించవలసిన యవసరమును లేదు.

సీ. విరటుని బొడగాంచి ♦ వినయంపుఁబలుకుల
నతనికామోదమ్ము ♦ ననుఘటించి
షడ్రసోపేతమై ♦ చవులూరఁ గావింతు
వంటకంబులనెల్ల ♦ వలసినన్ని
బలమరఁ జేతుఁ బె ♦ బ్బులినైన నెదురైన
జెట్టిమల్లుఁడు నన్ను ♦ జెనకె వెరచు
గత్తిఁ గొడ్డలి లేక ♦ కాళ్ళేతులనుఁబట్టి
కట్టెలు ముక్కము ♦ క్కలుగఁ జేతు
గీ. వలలుఁడనువాఁడ నా వ ♦ కులమువాఁడ
నుంచఁదలఁతేని నీయొద్ద ♦ నుండువాఁడ
ధర్మరాజమహాసభా ♦ ద్వారకుండఁ
బంచు మేపనికైన మె ♦ ప్పించువాఁడ.

అనియతని మదికి విశ్వాసంబు పుట్టబలికి తన్మహానసంబున కధ్యక్షుండనై యుండెద గాని అన్నయ్యా!

మ. అనలాక్షుం బవరమ్మునందణచి ది ♦ వ్యాస్త్రమ్ము సాధించె న
య్యనిమేషేంద్రుని సాముగద్దియనెదా ♦ నాసీనుడై యొప్పె దై
త్యనికాయమ్మును గెల్చి ఖాండవవనీ ♦ దాహమ్ము సంధించె న
త్యనుదాత్తస్థితి నింద్రసూనుఁడును ♦ సేవాయత్తుఁడయ్యెం గటా.

అ—అన్నయ్యా! మున్ను నేనమరపురికరిగినతరి నన్నూర్వశికొఁడొకకారణంబున నపుంసకునిగా శపించుటయుఁ బాకశాసనుం డెఱింగి నన్నుఁగని మన్నించి వత్సా! యియ్యది యజ్ఞాతవాస సమయమ్మున నుపచరించునది. పిమ్మట శాపమోక్షణమునుంగలుగు. దీనికయి పిమ్మట బొందం[illegible]గా దనియెఁ గావునఁ బేడితనమును నాజా

నుబాహుబలత్వంబును గుణకిణాంకంబులును మఱుఁగుపడఁ గంచుకంబును శంఖవలయమ్ములును దాల్చి మత్స్యపురాధినాథు సన్నిధికరుగుదెంచి యతనిచే మన్ననల వడసి.

సీ. ఉత్తమాంగనలకు ♦ నృత్తగీతంబులు
గరపంగా గరువమ్ముఁ ♦ గలుగువాఁడ
నని వచియించి య ♦ య్యవనీశునెల్లైన
బనుపడి నేనియ్యు ♦ కొనఁగఁజేసి
యవరోధములనుండు ♦ నంగనామణులకు
తౌర్యత్రికములు ♦ దాత్తభంగి
ననుదినమ్మును నేరు ♦ పనువొందనెఱపుచు
మిన్నతనమ్మున ♦ మెలఁగువాఁడ

తే. గీ. నధిపుఁడొందలివాఁడవం ♦ చడిగె నేనిఁ
బాండవేయులపట్టపు ♦ భామమిగుల
నెఱవొసంగఁగ నేబృహ ♦ న్నల యనంగ
నుందు మున్నని యిచ్చెద ♦ నుత్తరంబు.

ధ—కం. మిన్నతనమ్మును మిక్కిలి
యున్నవసోయగము గలుగు ♦ నన్నకులుండే
తెన్నున నన్యుని భజియిం
పన్నేర్చునె తెలియదతఁడు ♦ మణిపూసగదా.

న—అన్నయార్యా! త్రొల్లియశ్వశిక్షావిచక్షణత్వంబున దక్షుండ నైతిఁగావున మత్స్యమహీనాథు కొల్వు నాకనుకూలంబు; గుఱ్ఱములకు వలయు తెఱంగులన్నియు నెఱుంగుదు. ఆయుః పరిమాణంబులరసి వయోవర్ణంబుసేతు జాత్యనుకూల శిక్షాక్రమంబుల నాహారవిహారాది వివిధవిషయంబులను మిగుల జాగరూకుండ.

చ. కసవడి వానలోఁ జినుకొ ♦ కండొడలం బడకుండఁ దేజిపై
నెడలి సవారుఁ జేయఁగలఁ ♦ బెల్లుగ కళ్లెలకేనియున్నశం

పడని తురంగమంబున నపాయత ♦ సన్నపుసూలుపోగున
న్దడ ముకధీనమాగతినెన ర్చెదఁ ♦ బేర్చెదనాహవంబులన్.

దామగ్రంధియనునామంబు ధరియించి యతనిమననువర్తిన ట్లతని పాలవసియించి కాలక్షేపంబుఁ జేయఁదలంచితి.

ధ—

చ. అనుపమదానశీలుఁడు స ♦ మాజనధర్మపథానువర్తి స
జ్జనవిహితుండు సద్గుణవి ♦ శాలుఁడు కుంతికిఁగూర్చువాఁడు తా
జననముఁ బొంది యేవగవు ♦ జాడమెఱుంగఁడు వీఁడు దేవుఁడే
యనఁదగుఁ బిన్నతమ్ముఁడహ ♦ హాపదునేగతినాశ్రయించెదన్.

సహదేవుఁడు—.

సీ. ఎగజేపి మీఁదికి ♦ నెగరెడు లేచునుఁ
జేఁదట్టి జవ్వాన ♦ జేపఁ జేతు
ముందైనఁ బొడ్చి పి ♦ రుందైనఁ దన్నుచో
బందంబు వేయక ♦ పాలుదీతు
తువ్వాన్ఁ గనుగొన్న ♦ రివ్వున మొకతాఁ్రిడఁ
గ్రెంపి పారెడు దానిఁ ♦ దేర్పఁ గలను
గొడ్డుపీగిన దాని ♦ కోఁడెతోఁ గూరిచి
గురుతుగాఁ బాలను ♦ గుడవఁ జేతు

గీ. బెదరు వాపెద మృగముల ♦ యుదరుఁ జోపి
రూపు మాపెద గోవ్రల ♦ రోగములను
ననుచువసియించివిరటుః ♦ యుకృమతిఁ గొసి
యాశ్రయింతుఁ దంత్రీపాలుఁ ♦ డనెడిపేర.

ధ—

మ. అలపాంచాలునిహోమకుండమునయం ♦ దావిర్భవంబదిగో
మలరన్వర్ధిలెఁ బేల యొక్కసనిసే ♦ యున్నేర్పు లేఁబొంటినై

మెలఁగం జాలదు సుందరీమణులలో ♦ మేల్బంతి యీయింతి నా
వలన దైన్యపుఁగరాని యీ పదలకుం ♦ బాలయ్యె నేఁడకట్టా.

(ధర్మరాజు ద్రౌపదిం డాయఁజని యామెహస్తంబులు తనహృదయమ్మునసుంచుకొని విషాదముతో) లలనామణీ! ద్రుపదమహారాజు హోమకుండమ్మున నబ్బురంబిబ్బడిగా నుదయించి పాండుమహారాజు కోడలివైన నీవుఁ గూడ నీవడువున నిడుములబడవలసి వచ్చెగా!

(విచారించుచున్నాఁడు)

ద్రౌ—ప్రాణేశ్వరా! పతిసన్నిధానమునఁ దదనుకూలపరిచారిణి యైనసతికి నిహపరమ్ములుఁ గరతలామలకమ్ములు, పతివైభవోపేతుండయినతరి ననుసరించుటయుఁ గష్టములపాలైనచో విడనాడుటయునుఁ బతివ్రతాధర్మమ్ములు గానేర్పనే, యిదిగాక మనమిప్పుడజ్ఞాతవాసంబొనరింపఁదగు నుపాయమ్ములు నాకలవడియున్నయవి. యెట్లంటిరేని, విన్నవించెద వినుండు.

చ. కలపములెన్నియో పలుర ♦ కమ్ముల నూతనగంధబంధురం
బులుగ నొనర్చి నెమ్మియునిఁ ♦ బూసెదఁ గస్తురిమేళనంబునన్
దిలకము దిద్దెద న్మెరసుఁ ♦ దీర్చెద నబ్బురమందఁ బూవుబె
త్తులు సవరించి యిచ్చి పరి ♦ తోషమొనర్చెద శిల్పనైపుణిన్.

క. మున్నెట్టు లెచటనుండెద
వన్నద్రుపదాత్మజాతి ♦ కనుచారిణినై
మన్ననలఁ గొంటి గరువము
సన్నముఁ గాకుండఁ గన్ను ♦ సన్న మెలఁగుచున్.

అని యుత్తర బిల్చి మాలినియన సైరంధ్రినయి సుధేష్ణకొలువు సేసెదఁగావున నాకయి మీరంతగా విచారింపంబనిలేదు.

ధ—రమణీమణీ! నీవెఱుంగనిదానవు కావుకాని.

గీ. మనకులాచారధర్మ వ ♦ ర్తనము పేర్మి
బ్రోదిసేయంగ జాలిన ♦ పుణ్యసతివి

దోసగులోనఁగూర్పఁదలతురు ♦ తులువలెంతు
మనలవలెజుమ్మి నాపల్కు ♦ మదిని నమ్ము.

ద్రౌ—(నవ్వుచు) ప్రాణేశ్వరా! జాతిసామాన్యము ననుసరించి నన్ను మీరెట్లనవచ్చునా.

తే. గీ. విను పతివ్రతాధర్మప ♦ ర్తనము నెందు
పడఁలగానీకు సైరంధ్రి ♦ జాతివారు
గాన నేనునుఁ దద్గతిఁ ♦ బూని యెందు
వేషభాషల నుచితంపు ♦ విధులనడతు.

మఱియును.

క. మితభాషణమ్ములును నము
చితవేషమమర సుధేష్ణ ♦ చిత్తము కుతుకా
న్వితమగు విధమున విబుధ
స్తుతిపాత్రమ నగుచు మెలగు ♦ దుర్ధర్మసుతా.

ధ—తమ్ములారా! మన మింక తడయ బనిలేదు. మత్స్య మగధ కళింగ సూరసేనాది జనపదంబులు సాధుజనాకీర్ణమ్ములయి బహుసస్యసమృద్ధమ్ములయి వాసయోగ్యమ్ములయి యున్నవని యింతకు ముందు వినియుంటిమి. అందును మత్స్యమహీపాలుం డుదారశీలుండును, సద్గుణవిశాలుండు, దయాళుండు, సాధుజనలోలుండును గావున నతని పాల వసియించి యీయేఁడుఁ గడపుదము. మన యగ్నిహోత్రములు ధౌమ్యులు రక్షింపుదురు. (ధౌమ్యులను జూచుచున్నాడు) యేమి మహానుభావా.

ధౌ—సందేహమేల, నాకును జెప్పవలయునా! రాజా!

ధ—మన మహానసాధ్యక్షులును వంటలవారును ద్రౌపదీ పరిచారికలును మాయత్తవారింటి కరుగువారు; రథంబులతో నింద్రసేనాదులయిన సారథులు ద్వారకకరుగువారు, అందెవ్వారేని మన

వార్తలడిగి రేని ద్వైతవనమ్మునఁ దొరంగితిమి. ఆదొర లెంచఁబోయిరో మే మెఱుంగ మనఁగలవారుగా నియమించునది.

ధౌ—ధర్మరాజా! అట్లనే నీయాజ్ఞ ననుసరింతురు.

తే. గీ. ఆభిజాత్యంబు గలయన్వ ♦ యంబు నందు
బుట్టి పెరిగిన యుత్తమ ♦ పూరుషులకు
నట్టి సామాన్యమానవు ♦ నంద జేరి
సేవఁ జేయంగ వలసె హా ♦ దైవమహిమ.

మదపుటేనుఁగులు దడ్డికంతలోఁ బడిన చందంబయ్యె విధివిధానంబనుభవింప కపనయింప వచ్చునే.

చ. అరయఁగఁ గౌరవాన్వయము ♦ నందు జనించియు గారవంబునం
బెరిగిన యట్టివారు గద ♦ మీరలికొక్కనికొల్వు గొల్వుట
ల్గరము గడింది నేర్పుమెయిఁ ♦ గాలముఁ బుచ్చుటలొప్పుగావున
న్గురుతుగఁ గొన్ని ధర్మములు ♦ కోరి వచించెద నాలకింతురే.

రాజసేవనంబసిధారావలేపనంబని పెద్దలు చెప్పుదురు. కావున సేవాధర్మమ్ములు దిక్ప్రదర్శనంబుఁ గావించెద సావధానులరై వినుండు.

తే. గీ. మహిపు కార్యమ్ములను నప్ర ♦ మాదముగను
వెరవెఱిఁగి చయ్యన న్నెర ♦ వేర్పవలయు
నాజ్ఞఁ దప్పిన నరనాథుఁ ♦ డాప్తుఁడనక
పుత్రునైనను దండన ♦ పాత్రుఁ జేయు.

క. పలువురకు సంకటంబుగ
మెలఁగుట తగదెప్పుడయిన ♦ మెలగిననపుడే
తెలిసికొని బుద్ధిమంతులు
సిలుగులఁ బెట్టుదురు రాజు ♦ చెడఁజూచుఁదనిన్.

క. నను మన్నించు మహీపతి
యనుచుఁ బరవసమ్మున నన ♦ ము జనవృత్తి

మ్మున నసువంగాఁ జెల్లగు
జనములయొక బాలె రాజ ♦ సమ్మతముంగదా ?

ఉ. అంతిపురమ్ము చుట్టరిక ♦ మంతయుఁ గీడగు నంతకంటె రెం
డంతలు చెడ్డ కుబ్జవః ♦ తానలతోఁ జెలువమ్ము సేత తా
నెంతటి యాప్తుడైన ధర ♦ నీ ద్రుపదమ్ము శ్మశానసూనమ
ట్లెంతయు భీతిఁ జోడఁజరి ♦ యింపనిచోఁ బరువంబు నిల్చునే.

ఉ. మన్నన కుబ్బఁగూడదవ ♦ మానముఁ జేసిన స్రుక్కఁ జెల్లద
త్యున్నతమైన యాసనము ♦ లుత్తమవాహనములున్న రేడ్రాఁడీ
తన్నడు నెక్కరాదు విను ♦ డియిక యంతిపురంబులోనఁదా
విన్న యుదంతము ల్వెలికిఁ బెట్టుట ♦ తప్పు యశోభిలాషికిన్.

ధర్మరాజా! నా చెప్పిన యీయర్థములు స్థాలీపులాక న్యాయమ్ములుగా సంగ్రహించి యప్రమాదులరై వర్తిల్లుఁడు.

ధర్మ— క. దేవా మహానుభావా
దేవర మామీఁద ప్రేమ ♦ నెల్లముగా నే
వావిధులీగతిఁ దెలుపుట
ధీవిలసితమయ్యె బ్రతికి ♦ తిమి మీకరుణన్.

స్వామీ ! పోయివచ్చెద, నమస్కారము. (నమస్కరించును.)

ధౌ—సంకల్పసిద్ధిర్భూయాత్.

భీ, అ, న, స—(నమస్కరింతురు.)

ధౌ—లబ్ధప్రతిజ్ఞా భవంతు

ధ—సోదరులారా ! మనమిందుఁ దడయంబని లేదు. విరటుపురమ్ముఁ జేరు మార్గమున బోదము నడువుఁడు.

(అందఱును నిష్క్రమించిరి)

ప్రథమాంకము సంపూర్ణము.

శ్రీశారదాంబాయైనమః.

# కీచకవధ.



## ద్వితీయాంకము.

ధర్మరాజు, భీముఁడు, అర్జునుఁడు, నకులుఁడు, సహదేవుఁడును—దూరమున ద్రౌపదియుఁ బ్రవేశింతురు.

ద్రౌ—ప్రాణనాథా! (బిగ్గరగాఁ బిలుచుచు నాయాసముతో చెట్టునీడను చతికిలఁబడుచున్నది.)

ధ,- భీ,- అ,- న- స- లు—(తిరిగిచూచుచున్నారు)

ధర్మ—భీమసేనా! చూచితివా. మనమీమాటలసందున తొందరగా వెనుకఁజూడక నడచి వచ్చితిమి. నడువలేక యాయాసముతో ద్రౌపది ఆచెట్టునీడ చదికిలఁబడియున్నది. చూచితివా. అయ్యో! (భీ,- అ- న,- స- తొందరపడి వెళ్ళఁబోవుదురు)

క. అల్లదె ద్రుపదాత్మజ యొడ
లెల్లం జెమ్మటలఁదోఁగి ♦ యొంతయు మదిగా
సిల్లుచు నున్నది యటఁ జని
తల్లన గొనిరమ్మి యోస ♦ మీరకుమారా.

భీ—చిత్తము (ద్రౌపదిదగ్గరకుఁ బోవుచున్నాడు)

ద్రౌ—(భీముఁవంకఁజూచుచు—ఆయాసముతో) ప్రాణనాథా

ఉ. పోరిలది యిచ్చొటచ్చొటకు ♦ బుద్ధిహుటాహుటిని సాగివచ్చుటన్
గాళులఁ దీపు బుట్టెడిని ♦ ఖాంబుల జిప్పిలుచుండె నెత్తురు
ల్గాలఁ జఱంచె దప్పియును ♦ శక్యముఁ జేరెడి నంతకంతకు
న్దాళఁగ లేను నేలఁ జర ♦ ణంబిడ నేరఁ బికేమి సేయుదున్.

భీ—(తనయుత్తరీయముతో విసరుచున్నాఁడు) ప్రాణేశ్వరీ!

సీ. అభినవభక్ష్యభో ♦ జ్యమ్ములానెడు నీకు
నడవికూరలె మంచి ♦ యశనమాయె
నాతోద్యరావమ్ము ♦ లాలింపఁ దగునీకు
వనజంతుఘోషము ♦ ల్వినఁగనాయె
హంసతూలీశయ్య ♦ లందు గూర్కెడు నీకు
కఠినరానేలలె ♦ పరపులాయె
చారుసౌధములఁబ ♦ చారు చేసెడు నీకు
గహనకంటకవనము ♦ ల్నడువ నాయె
కటకటా యెట్టి నికృతి ♦ క్కారణి నిలువ
నీడ కుండువ నన్నంబు నుం ♦ డియున్న లేక
యడవులం బడి యిడుములు ♦ కుడువవలసె
నేమి జేసెదు తప్పునే ♦ యీశ్వరాజ్ఞ. (విచారించును)

ద్రౌ—ప్రాణేశ్వరా! మనమరుగు పురంబు కురంగటనున్న దనుఁ దలంపున మీవెనువెంటఁబడి దరుముకొని వచ్చుటంజేసి యీయాసం బధికంబయినది. నాచరణాబ్జములు కఠినరాతినేలపయి నడచుట వలన కంది నెత్తురు చిమ్ముచున్నవి చూడుము.

(అరికాళ్ళు చూపును)

భీ—అయ్యయ్యో, కందినవంటి వేమి, యిదిగో పొక్కులెక్కినవి. (అని చేతితోఁ జూపుచున్నాఁడు) ప్రాణేశ్వరీ! మనవారందఱు మనకొఱకెదురు జూచుచున్నవారు, మనము మెల్లన వారలం జేరుదము లెమ్ము. (ద్రౌపది చేయిపట్టుకొని నడచుచున్నాఁడు.)

సీ. ఖరకరా నీవిఁక ♦ కోరకోరఁ జూపక
యొక్కింత వేడిమి ♦ యుడుగ వలయు
కంటకవ్రాతమా ♦ బంటుతనంబేల

తలవంచి యవలకుఁ ♦ దొలఁగవలయు
హింస్రజంతువ్రలార ♦ మెఱుఁగత్తి యరవక
యురుగిరిదరులలో ♦ నుండవలయు
రాగుట్టలార పో ♦ కాకులు మీ కేల
త్రోవకుఁ దవ్వుఁగాఁ ♦ దొలఁగ వలయు
ద్రుపదమహీపతి గాదిలి ♦ కూఁతురీ పె
తలఁప నిది సాధ్వి పాండవ ♦ ధర్మపత్ని
మగలతోఁ గూడ నిర్వ్యాజ ♦ మనసు వలసె
గలఁడు భీకరుఁడు చెల్లవా ♦ గడము లిచట.

(ద్రౌపది భీముఁడును ధర్మరాజుకడం జేరుదురు)

అ—అన్నయ్యా! ద్రౌపది జేరవచ్చినది. విరటునినగరమ్మును జేరుటకు వచ్చినది. మనయీయాయుధములతో నందులకరిగితిమేని మనప్రయత్నమునకు మోసమగును.

ధ—సంశయమేమి! యీ మన యాయుధములను, మనలను నెఱుఁగనివా రెవరు తమ్ముఁడా! కాని యిక విరటుపురంబిక్కడి కెంతదూరమున నున్నది?

స—సమీపమె. అన్నయ్యా! పసులవారు దూరమున నటు చూడుఁడు. (చెయిపెట్టిచూపును)

శా. కాకోలూకకపోతజంబుకకులా ♦ ఖండాప్రియారావదు
ర్భీకంబై తతశాకినీభయదగం ♦ భీరాట్టహాసక్రమో
ద్రేకంబైనశ్మశానవాటి యదె యం ♦ దే జమ్మివృక్షమ్ము సొం
పై కన్పట్టెడినల్లదే యవల మ ♦ త్స్యాధీశుప్రోలొప్పెడిన్.

(అందఱును నడతురు)

అ—అన్నయ్యా! యిదియె శ్మశానవాటి చూడుఁడు. చూడం జూడ భయమును శోకమ్మును తుదకు వైరాగ్యమ్మును వెల్లిగొల్పుచున్నది.

ధ—సందేహమా?

అర్జు—

సీ. మృతకళేబరముసు ♦ జితినిడి యటఁ జేరి
రోదన్పుచుండిరి చుట్ట ♦ లెలుఁగులెత్తి
చితినిడ్డశవమది ♦ చిటపటధ్వనులు ది
క్తటములు మార్మ్రోఁగియుఁ ♦ గాలఁదొడఁగె
నది యనాథప్రేత ♦ మరగాలి యునుఁ గాక
కంకగృధ్రంబుల ♦ గ్రాసమయ్యె
బలలమ్ము బుష్పమ్ము ♦ బంతి యాసాదించు
నల్ల పైశాచ్యట్ట ♦ హాసములివి
మృత్తికాస్నానములుఁ జేసి మెయి వడంక
గాఁదిలోదకవాసోద ♦ కములువిడచి
ఘు: పిత్రాణవిముక్తులా ♦ జనులువీర
లిద్ది మననమ్ము

నహ—మన కేల ♦ వద్దుపదరె.

అ—అన్నయ్యా! అదె శమీవృక్ష రాజము.

లయగ్రాహి.

ముమ్మరము జొంపములు ♦ గ్రమ్మచు నహా మ్రాకిది
మమ్ము నధిమ్ముగను ♦ జిమ్మకొనుచుండెన్
బమ్మెరఁ దివమ్మవలఁ ♦ గుమ్మెలవిధమ్ము కొన
కొమ్మలచయమ్ముఁ గడుఁ ♦ రెమ్మకొనె దిక్కుల్
కమ్మనయి నిమ్మనయి ♦ జమ్మితరు విల్లిదిగో
నెమ్మదిగ నచ్చోట శ్రీ ♦ మమ్ముడిపి శస్త్రా
స్త్రమ్ములను డాచిన భ ♦ యమ్మొదవ దెందమునకు
యమ్ము కడఁబమ్మకొను ♦ నెమ్మిగొనవచ్చున్.

ధర్మ—తమ్ములారా! లుబ్ధుని యర్థమ్ము వగిది నీశ్మశాన వృక్షమ్ము నిరర్థకమ్మగుట యిందులకొక్క ప్రయోజనమ్ము లేమిం జేసి జను లెవ్వరును రానొల్లరు. కావున మన యాయుధమ్ముల నీజమ్మి వృక్షమ్మున శవాకారములుగాఁ బొందుపరచి దాచుదము. మీ మీ కోదండము లెక్కు లుడించి నాచేతి కొసంగుఁడు.

(తన కోదండము నెక్కుడించును) భీమసేనా! నీగద నిటు దెమ్ము.

భీ—(విచారించుచు)

శా. ఎన్నో యుద్ధములందునన్నొని జయం ♦ బేగొంటి చేయారగా
నన్నీమాత్రికున నంటఁ గట్టి చనుట ♦ న్యాయంబు సూ నాకు మా
పన్నెండ న్నమయంబు జల్పికొని సా ♦ భ్రాత్రమ్ము సంధిల్లఁగా
నిన్నుం దాల్చెదఁ గేలు మోడ్పులనుసం ♦ ధింతు న్గదాదండమా.

(గదను ధర్మరాజున కిచ్చును.)

ధ—అర్జునా! నీగాండీవము నపగతగుణముగావించి నాచేతికిమ్ము.

అర్జు—చిత్తము (గాండీవము రెండుచేతులం బట్టుకొని)

ఉ. ఖాండవమేర్చువాఁడు ననుఁ ♦ గారవమొప్పఁగ మెచ్చి వీతిహో
త్రుండొసఁగం ధరించితి వి ♦ రోధులచైదిని నిర్దయంజించెన
న్గాండివమా యశుగ్రిహము ♦ నన్నెలవిమ్మిదె గొమ్ము భక్తిమై
దండముఁ బెట్టెద న్నినుఁ బ ♦ దంపడి పట్టెదఁ బోయివచ్చెదన్.

(నకుల సహదేవులు తమతమాయుధమ్ముల ధర్మజున కిచ్చుచున్నారు.)

ధ—(ఆయుధములను శవాకారములుగాఁగట్టి చెట్టునందుంచి ప్రదక్షిణము చేయుచు చేతులు మోడ్చుచున్నాఁడు)

మ. ధృతరాష్ట్రాత్మజుఁడన్న మండిపడును ♦ దీప్తాగ్రిహాండీ మరు
త్సుతుఁడ్రష్టే మదమెత్తి మీకడకువ ♦ చ్చుం గాక వంచింపుఁడే
గతి నేనాతని రోషభీషణతక ♦ గ్గఁబైన మోసంబగు
న్మతి మీరేమరకుండుఁ డెంతయుమిము ♦ న్బ్రార్థించి కీర్తించెదన్.

తమ్ముండ్లారా! మున్ను మీజీవితంబుల నొసంగిన యాధర్మదేవత నొక్కసారి ప్రార్థించిపోవుదము.

అ—చిత్తము.

ధర్మ—

మ. అరణి న్వెదుకఁగఁ గానలం దిరిగి యా ♦ యాసంబువోవన్నరీ
వరరుచ్యాంబువుఁ గోరి కాలవశత ♦ వ్యాపించు నీనాదు సో
దరుల ప్రాణము లిచ్చి కాచితివి ము ♦ న్ధర్మాత్మ కా గూఢ సం
చరణమ్ము న్భువరింపఁ బోదుము కరుణే ♦ చండాంశుఁ గాపాడెదో.

క. కరుణామతి మున్నిచ్చిన
వరము న్మదిఁ దలచి నాదు ♦ భ్రాతల కెందు
న్దురితమ్ము నేరయకుండఁగఁ
బరికింపగ వలయుఁ దండ్రి ♦ ప్రార్థింతు నినున్.

ధర్మదేవత ఆకాశయానమునఁ బ్రత్యక్షమగును.)

(ధర్మరాజు మొదలగువారందఱుఁ నమస్కరించుచున్నారు.)

ధర్మదేవత—

ఉ. సౌమ్యులు నీదు తమ్ములు ప్ర ♦ శాంతుఁడవీ వఖిలార్థ వేదియా
న్సౌమ్యుఁడు మీకు సేవనవి ♦ ధానములన్వ్వనరించె సౌఖ్యపా
రమ్యము గల్గునందు మిము ♦ రండని స్వాగతమిచ్చు సద్యశో
రమ్యుఁడు మత్స్యరాజు సుక ♦ రమ్ముగ నన్నియుఁ బోయిరండికన్.

వత్సా! నీకృతకసన్న్యాసంబునకు వలయు దండకమండలు కాషాయంబులును, నీతమ్ములయు, మాకోడలియు నవతారమ్ములకు వలయు పరిధానములును, మీకిప్పుడ సిద్ధింపఁగలవు. వనిపుడిఁక జనుఁడు.

(ధర్మదేవత, నిష్క్రమించును.)

ధ—తమ్ములారా! మనమింక వలయుదెఱఁగున వేషముల నవరించుకొని విరటుపురంబునకుఁ బోవుదము.

(అందఱును, నిష్క్రమించిరి.)

---

శ్రీ శారదాంబాయైనమః.

# కీచకవధ.

## తృతీయాంకము.

(ప్రియంవదుఁడును, అతివినయుఁడును, చెరియొకత్రోవను బ్రవేశింతురు.)

ప్రి—అతివినయా! నీవింతతొందరగా వచ్చితివేల.

అ—బావా! నేను ముందుగా నీతో మాట్లాడవలెనని వచ్చితిని; తలచినపని దారిలోనే యయినదన్నట్లు నీవిక్కడనే యుంటివి.

ప్రి—చాలరోజులనుండి నిన్ను జూడవలెనని యోచించుచుండ నేటికి గనబడితివా! మిత్రునియందు దయయిట్లున్నది, నేఁడింతతొందరగా వచ్చితివేల.

అ—స్వామికార్యము నిర్వహించుటకై తగుప్రయత్నము చేయుచుండుటచేత నెప్పటికప్పుడే తీరికలేకపోయినది. అధిపులు నూతనప్రియులుగదా? నేఁడొక క్రొత్తవర్తమానము అయ్యగారికి తెలుపుటకై కొలువుకూటంబునకుఁ బోవుసమయముగాకుండ పెందలకడ వచ్చితిని.

ప్రి—అతివినయుఁడా! క్రొత్తసంగతి యనుచుంటివే నేను వినఁ దగదా?

అ—మిత్రమా! నీవు వినరానిదొకటుండునా? నీవు వినఁదగినదియును రాజుగారు విని చేయఁదగినదియును.

ప్రి—చెప్పఁదగియుండినచోఁ జెప్పుము.

అ—చెప్పుటకే వచ్చితినని యిదివరకే చెప్పితిని. చెప్పకుండ పోయెదనా?

ప్రి—చెప్పుము.

అ—సావధానుఁడవై వినుము. నిన్న సాయంకాలమున విరటుని యంతిపురిదరికి పోయి యుంటి.

ప్రి—సుధేష్ణ తమ్ముని రమ్మని నీతో జెప్పెనా యేమి.

అ—చెప్పుచుండగనే తొందరపడెడవేల యందొక్క సుందరాంగిని జూచి వచ్చితిని.

ప్రి—(స్వగతము) వీడెంత దుర్మార్గుడో పతివ్రతలకుగూడ మానభంగము సేయుచుండ దలపెట్టినాడు. రాజునకుఁదగిన బంటు, బంటునకుఁదగిన రాజు. ఆహా! కలికాలము; ఇప్పుడు నే నేమనినను నాకుగూడ నాపదకలిగింపఁ గలడు. వీని జోలి నాకేల (ప్రకాశము) ఆమెను మనమహారాణియునకు సందర్భపరచవలెనని నీవు తలంచితివా?

అ—అమ్మయ్యో నాతెరమా! ఆసుందరాంగిని జూచినదిమొదలు నే నిట్లనుకొనుచుంటిని.

క. అవనితకితఁడు దగునా

పూవుంబోఁడియు నితనికి ♦ బొందగు వీక్షిం

డావి నమకూరుగతి సం

భావితమగు నుభయసంగ ♦ మంబుధరద్రిన్.

ప్రి—(రిచ్చపడి) ఇతఁడుచూచినది పాపము సైరంధ్రియేమో (ప్రకాశముగా) మిత్రమా! నీవు తలఁచినచో నెంతపని యైనను నెరవేర్పగలవు కాని యామెసోయగం బొక్కింత నాకు శ్రవణానందమొనర్చెదవా?

అ—ఉ. అమ్మడిరాక్షిసోయగమ ♦ యారె వచింపగ నాకు శక్యమా

బమ్మయు నైన నోరు మెద ♦ పందగ డున్నదియున్న యట్లునె

ర్వమ్మును దెల్ప నింక నెయి ♦ పల్కులనొక్కఫలంబుగల్గదా

కొమ్మకు బోలు నొక్కకులు ♦ కుంజవరాలిక లేదుధారుణిన్.

అయినను నానేర్చినకొలంది నొక్కింత యొఱింగించెద గ్రహించుము.

ఉ. సోముని గేరుమోము నిడు ♦ సోగకనుంగవ కల్వగుబ్బలున్
కోమలమైన మేను డళు ♦ కుందెలి చెక్కులు ముద్దుబల్కులున్
జీమలబారు యార్గటికి ♦ చీకటి కూకటిజుమ్ము పెన్నెరుల్
మామిడిపండువంటిదిసు ♦ మా యొజిగించెద నేమిచేయునో.

పి—(స్వగతము) ఇది నిజముగా సైరంధ్రియే. ఆమె యితని ప్రయత్నమునకు నలవడునా (ప్రకాశముగా) అయ్యగారా యేమిచేయునోయనుచుంటివి. నీ వీవార్త చెప్పినతోడనే నీకు బసదనంబిచ్చి సంతసింపజేయును. పిదప నాయమ్మ నెట్లైనం గలయ ప్రయత్నంబు జేయును. యింతకు నీతడేమయినను ముందుగా నీరొట్టి నేతంబడినది. నీ పనిం జూచుకొమ్ము యిదుండుము. నీవేమయిన యీయయ్యవృత్తాంత మూమెకుం దెలిపితివా.

అ—మిత్రమా! ఆమె మహాపతివ్రతయట. నేనామెదరికే పోలేదు. నేనా చెప్పెడువాడను మనమక్కడ పనకట్టము.

ప్రి—మనయయ్యగారిందులకు సంశయింపనివారే. నీ విచ్చట చేరినది మొదలు నిరర్గళమయినది.

అ—సంశయమేమి, అయ్యగారి సామర్థ్యము నే నెఱుగనా.

పి—పరదారాపహారణపాండిత్యము మనయయ్యగారికడ పుట్టినది పెరుగుచున్నది యింకను నీవలన పెరుగగలదు.

అ—ఈవర్తమానమును నీతో ముందుగాజెప్పి అయ్యగారికి నీచేజెప్పింపవలెనని వచ్చితిని. కొంచెము దయచేసి నాతో గూడవచ్చెదవా?

ప్రి—నాకేల! చూచినవాడు చెప్పిననే కొంతరసభంగమగును చూచినవాడవు నీవు నేను నీవలనవింటిని. కాన నేనుచెప్పుటుచితముగాదు. నీవేచెప్పుము.

అ—సెలవిచ్చెదరేని నేనే చెప్పెదను (అని పోవుచున్నాడు)

ఇది విష్కంభము.

ద్వేషిశాత్రై తమంత రత్రి ♦ దేల్పుచుటంచురు కాన్కలిచ్చి
ర్వ్యాజపరాక్రమక్రమధు ♦ రంధరుడన్నను బోలరెవ్వరున్.

నేనీరాజునొద్ద దండనాథుండను. నన్ను సింహబలుండని యార్యులందురు.

మా—(స్వగతము.) ఈతండు సౌదర్యపరాక్రమగర్వితుండు కాంబోలును. తన్నుతానే పొగడుకొనుచున్నాడు. వీనిజోలినాకేల.

కీ—తే. గీ. కుందనముంబోలి చొక్కమై ♦ యంద మొలుకు
నీదుతారుణ్యమడవి వె ♦ న్నెలయొనర్చి
వరపుష్పమ్ముల మేను ♦ జేద్వాడగఁజేయు
చిందుమెలగంగఁ గతమేమి ♦ యిందువదన.

మా—(స్వగతము) ఈతడింతటితోఁ బోవునట్టు లేదు. అయిన నీమాటేమనునో. అప్పటికొలది యూహించెదను.

కీ—ఉ. ఓసరసీరుహాక్షి? విను ♦ ముల్లము నీపయిఁజిక్కెనింకని
శ్వాసముఁజూపి కౌఁగిలియి ♦ సంగుమనంగుఁడభంగవిక్రముం
డీసరవోఁకకిస్కునల ♦ యించెడిఁ గొంకక పూలకోరులన్
బాసట లేదు నాకొక యు ♦ పాయముఁదోచదపాయహీనమై.

మా—(స్వగతము) ఓహో యాతండు దురభిమానియై యున్నవాఁడు. తొందరపడుట ప్రయోజనమ్ముకాదు. వెరపునతప్పించుకొనవలయును. (ప్రకాశముగా)

మ. చనునేయిట్లననాఁడు బుట్టువులతో ♦ జన్మింపగాతే వెసా
ధ్వనిక్రుష్టాన్వయజాతయంచుఁ ♦ దగుబుద్ధింజూడుమోయన్నయీ
తనుపెమాసినచీరయేవముగుచం ♦ దమ్మొంగఁఘంగొన్నఁగా
మునిబొరింబకుబెట్టు నాపడుచు బా ♦ ముల్బొచినస్గిచగా.

కీ—లలనామణీ నీయువయొవలక్షణములు గనుంగొనన యుత్తమవంశజాతవని నీవు చెప్పకయే చెప్పుచున్నయని. (కొంచెము దగ్గరకుబోవుచున్నాఁడు)

చ. అలికులవేణి! నన్నిటులు ♦ నాలము జేయుట మేలె మన్మథుం
డలజడి బెట్టెడిం గరకు ♦ టమ్ము లుగమ్ములుగాడ నేసి నీ
కలకలలాడు ముద్దుల మొ ♦ గమ్మొకయించుక యెత్తిచూడు మీ
వలపిక నిల్వనోపనను ♦ వాతెర పానకమానకుండగన్.

మాలి— ఛీ. ఛీ. తులువా. నోటికొవ్వున క్రిందుమీదుం గానక ప్రేలెదవా. పరదారాపహరణంబున మున్ను రావణాదులు సపుత్రమిత్రంబుగా నిర్మూలంబగుట యెరుగవే? ఇంక నైన బుద్ధిమంతుడవై మనుము. మముబోంట్లజోలికి రాకుము. వేగజనుము.

కీ— ఉ. అక్కట వెన్నవంటి హృద ♦ మనమ్మవల ఱమ్మగఁ జేయ నేల నా
మక్కువ దీర్పుమంచుఁ బ్రతి ♦ మాలిన నగ్గసరంగ నేల నీ
పుక్కిటివీడెమిచ్చి యుర ♦ మున్ బిగియారఁగఁ గౌగిలించిన
క్కెరవింటివాని కద ♦ నమ్ములఁ దేల్పవిదేల కోమలీ.

మా— (కోపముతో, అక్కడనుండి లేచి మఱియొకచోట కూర్చుండును)

కీ— (దగ్గరకు బోవుచున్నాడు)

శా. భవదీయాజ్ఞయె శాసనంబుగ నిను ♦ న్బట్టంపుదేవేరిఁగా
విభవైశ్వర్యములెల్ల నీవశముగా ♦ వింతుంజుమీ యిందుకే
జవదాటంగలవాఁడ గాననుచు ♦ బాసల్జేతు మన్నించి యో
నవలా! నీ యధరామృతంబొసఁగుమా ♦ నన్నుం గటాక్షింపుమా.

మా— (చెవులుమూసికొనుచున్నది) పాపము శాంతించును గాక. (స్వగతము) వీడీసామవాక్యంబులం జక్కంబడువాఁడు గాఁడు (కోపముతో) (ప్రకాశముగా)

శా. ఓరి కీచక నీచ! దుర్మదవిభు ♦ ద్ఘోషన్మయోల్లుంఠనో
దారపాభిభవు లేపురో హ్వదురగం ♦ ధర్వాకృతుల్మత్పతుల్

ఘోరోదగ్రతదీయకోపదహన ♦ క్రూరార్చి నీరూపము
న్నీరుం జేయఁగలాదు ప్రేలకిచటన్ ఛీ లేచిపోరా వెసన్.

కీ.—(వెడనవ్వునవ్వుచు) రమణీ! చెప్పవైతివి. అయిదుగురు మగలకాలివై నన్నలజడిబెట్టి యాడించుచుంటివా నీపాతివ్రత్యముఁ దెలిసినదిలే చాలు నీపాటికి నీమాటలుఁ గట్టిపెట్టుము.

తే. గీ. నీవచించిన గంధర్వు ♦ లేవురయిన
మూఁడు లోకమ్ము లేకమై ♦ మొనసెనేని
నన్నుఁ జెనకుట యరిది యౌ ♦ నమ్ము మబల
రిత్తమాటల ననుబెద ♦ రింపనేల.

శా. నాతోడం జనుఁదెమ్ము రమ్ము తరుణీ ♦ నాకొంపు లేఁ బ్రాయము
న్జాతుల్మాగలమందు వేచుగతి నీ ♦ చన్మైనన యీదాస్యపుం
జేతల్సేయుచుఁ గాసి వెట్టఁ జనుకే ♦ చేతోభవప్రక్రియా
ద్వైతానందసుఖంబుబొందఁ దగుఁ గాం ♦ తా నన్నుఁ జేపట్టుమీ.

(మాలినినిఁ బట్టుకొనబోవును.)

మా.—(కోపముతో లేచుచున్నది) ఛీ ఛీ, కీచకా, కులపాంసనా, మూర్ఖాగ్రేసరా. నన్ను సాధారణవనితనుగా నెంచితివిరా. నీకు వినాశకాలమా. నీపాట్లు చూచుకొమ్ము. (అని లేచిపోవును)

కీ.—(వెంటఁబడును) రమణీ! పోకుపోకుము. పోయినంత మాత్రమునఁ గీచకుఁడు నిన్ను విడిచి పోవుననుకొంటివా. (అని వెంటఁ బడును.) (అటునిటుచూచును) లలనా! నన్ను గికురించి పోతివిగదా కానిమ్ము మాయక్కగారితో చెప్పి నీపని చక్కబెట్టించెదనులే. అప్పు డెందుపోగలవు.

(సుధేష్ణతోఁ దరగా ప్రవేశించును)

సు.—తమ్ముఁడా! నీవెప్పుడువచ్చితివి? ఈవేళాసమయమున

గూర్చుండుము. చాలదినములనుండి నిన్నుజూడవలెనని మోమువాచి యుంట నిప్పటికగుపడితివిగదా.

కీ—అక్కా! ప్రతిదినమును రాజసభకువచ్చుచు బోవుచునే యుంటిని దానికేమిగాని (ఆతురతతో) అక్కా! యిక్కడ చక్కెర వింటి దొరచేతి ఒక్కటూరియనఁ జొక్కమగుచక్కదనబుల యిక్క యగు నొక్కచక్కెరబొమ్మ చక్కటి పూవుబెత్తులు సవరించుచు నా చిత్తంబువ్రేత్తుగ నపహరించి యొందే జనియె నక్కలికిసియక్కర లోనిదిగా నోపు. దాని నీచక్కటికిం బిలిపించి నొక్కివక్కాణించి యక్కరజేసి నామక్కువదీర్పుంపుము. నాకు దిక్కు నీవుగాక మరి యింకెవ్వరక్కా?

సు—(స్వగతము) అయ్యో! ఈతండు మాలినియందు మరులు గొనియున్నవాఁడు. ఇది వారలించి చూచెదను.

శా. ఏరా! తమ్ముడ! వేలుపుంజెలులతో ♦ నీడైన లేజవ్వను
ల్లేరా! వేలకువేల్వ్రయ్యంగ్రహాసుఖా ♦ శ్లేషంబు సంధింపగా
రారా! నీకడకేపముట్టిపడుచీ ♦ రా! దాస్యపుంజేతలా
సైరంధ్రిం గలయుంగఁ గోరుఁదఁమెయే ♦ చందంబునంగల్గెరా.

తమ్ముఁడా! ఏటికిమాటలివి. ఈదాసియగాని నీకు భోగింపఁ దలఁచిన యెలజవ్వనులు గరవైరా.

కీచ—

ఉ. ఒక్కటి సెప్పెదన్విని మ ♦ దుక్తినిజంబని నమ్ముమక్క! యా
చక్కెరబొమ్మగోల్పదగు ♦ జవ్వని యవ్విధిసృష్టిలోన నే
దిక్కునఁ జూచినంగలదె? ♦ దీనికి నచ్చరమచ్చికంట్లక
మ్మక్క! గలాదుహస్తిమళి ♦ కాంతరమాంతరచింతఁజూడుమీ.

సు—తమ్ముఁడా! యిదివినుము.

మ. పరదారాహరణమ్ము పాపమది బా ♦ పన్నేరదే పాపితం
బగయుంగా పరివారిలోన సభశా ♦ బాఁదప్పగా నొత్రు చూ

పరు తోడ్తోఁ దలవంపు వాటిలు నిజా ♦ ప్తశ్రేణి యూకొన్నరా
సిరియుం బోవును బంక్తిబాహిరునిగా ♦ జేతుర్బుధుల్ దమ్ముఁడా.
మరియును.

క. పరదారాసంగమమున
కరగును సత్కీర్తిదఱుగు ♦ గలిగిన యాయుః
పరిమితియును మఱిదాసీ
పరతంత్రుని మానధనముఁ ♦ బాయుంగడకన్.

తమ్ముఁడా! ఇయ్యది దాసియగుటచేతను సంతానవతియగు కులాంగనయగుటంజేసియును నీకు త్యాగార్హంబుగాని భోగార్హంబు గాదు.

చ. మిలమిలమూఁపిపిందెవని మేలిమిపావడరింగులూరమై
ఘలఘలలాడుపొన్నగల కాంతులుదిక్కులఁజాఁజునార బ
ల్తళతళలీను చెక్కులను తారవుచిన్నగ వౌనుమీరఁద
న్వలచినకాంతఁగల్గియు భాగ్యమె భాగ్యమగున్ సహోదరా.

ఉ. ఈగతిఁ బొట్టకూటికయి ♦ యిక్కడఁ జేరి దినక్రమంబునన్
జాగపుఁ గూడు మెక్కి యొక ♦ చాయను బోడిమి కల్గఁగాని యే
నాగరికంపుచందముగ ♦ నంబడదించుక దాస్యపుంబనిం
బాగరి యాటఁగాంచి మరు ♦ బారికిఁ జిక్కఁదవయ్య తమ్ముఁడా!

తే. గీ. మేకవన్నెలపులి పై ♦ మెఱుఁగుజూచి
మోసపోకుము బ్రతుకుపై ♦ నాసయున్న
దాని కేవ్వరు మగలు గం ♦ ధర్వులంట
బ్రతికియున్నను దినవచ్చుఁ ♦ బలుసుకూర.

కీ—(కోపముతో డిగ్గునలేచుచున్నాఁడు)

తే. గీ. దాని కేవ్వరు మగలు గం ♦ ధర్వులనుచు
వట్టి దంభన జేయంగ ♦ వలదు నన్ను

నామక్రోధాగ్నికాహుతి ♦ యగుమరల్ల
కప్పకూనలు సర్పము ♦ గ్గరవగలవె.

అక్కా!

ఉ. చాతురి గల్గెనేని నెకె ♦ సక్కెములాడఁగ నేటికక్కా! యీ
నీతులు గట్టిపెట్టి కరు ♦ ణింపుము బుద్ధులఁ జెప్పనేల సం
ప్రీతియెలర్ప నాసుదతి ♦ మేకొనఁ జేయుము నన్ను గూర్పవీ
వాతెరపానకమ్ముఁగొని ♦ వాలిన సౌఖ్యద నీకు మ్రొక్కెదన్.

అక్కా! నాబ్రతుకు నీచేతిదేని వేగవట్టొనరింపుము.

(కీచకుఁడు సుధేష్ణ కాళ్ళపైఁబడును)

సు-(స్వగతము) వీనికెంత జెప్పినను వెఱ్ఱివదలినది రోకలి తలఁజుట్టుమనుచున్నాఁడు. ఈసతియందలి మోహావేశంబున నొడలెఱుంగక మూర్ఛమునింగియున్నవాఁడు ఇది యధికమైన తుదకేమిచేయునో, యీ బెడయన్ననో, పరమపతివ్రతయట. బలపరాక్రమ సంపన్నలయిన యేవురు గంధర్వులను గట్టికొనియున్నదట. ఇదియెంత నిజమో, బలవంతమున నీయతివఁ గొనినను మీఁదిమిక్కిలి రాక తీరునా. ఎవని కర్మంబునకెవరు కర్తలు. కాఁగలయర్థంబు గాకతీరదు. నాకన్నుల యెదుట నీవు ప్రాణంబుల విడవకుండ నిప్పటికి కాపాడెదను. (పయ్యెదతో సవరుమ పరికాశము) తమ్ముఁడా!

తే. గీ. ఎంత జెప్పిన మరలవి ♦ దేల యిట్టి
నేఁడె నీకడకంపెదఁ ♦ జేడెనొల్లొ
కోర్కె దీరంగ నీయింట ♦ గూఢముకొంక
ప్రాణమ్ము వసలంగవలదు ని ♦ జమ్ము నమ్ము.

కీ—(లేచి సంతోషముతో) మఱచిపోయెదవుసుమీ, అక్కా! తలవాకిలి కనిపెట్టుకొనియుండెద. (అనిపోవును)

సు—(స్వగతము) దైవమా! ఏమిచేయుదును. ఈవల్లవాధ

రిని నల్లిదమగు పనులవెంబడిఁ బంపకుండ నేలుకొందునని మును బాసట యిచ్చితి. ఇప్పుడది కల్లబొల్లిజేయుట పెల్లగుదురితంబు గదా నాగారాబుతమ్ముఁడు మున్మున్నరంబగు విరాళి నమ్మాలికంబుగొనియున్న వాఁడు. తుటవిలుకాని గంటులంబడి యేమౌనో. అయ్యో! ముందుకుఁ బోయిన నుయ్యి. వెనుకకువచ్చిన గొయ్యి. విచారించియేమి చేయుదును. నాచేతనైన ప్రయత్నమును జేసి యొకకపటమ్ముబన్ని యాయతివ నెట్లైన వానియింటికంపెద.

(ముసుగువెట్టుకొని పైటచెరంగు నేలంబడుచుకొని పరుగున)

మాలినీ! మాలినీ! మాలినీ!

ప్ర. మాలిని.

మా — అమ్మయేమి.

సు — యొకమాటు రయమ్మున రమ్మా.

మా — వచ్చితిఁ.

సు — 2 నాలుకయెండబారెఁ దమి ♦ నాటకయుస్సు

తలయొఖ్ఖటించెదఁ 3 దాళఁగలేనె

మా — (స్వగతము) ఇదియంతయు యేఁడియో నన్నుమోసము సేయనెంచి యిట్లనుచున్నది.

(ప్రకాశము) మందుగొని త్రావిన నన్నియు బోవు దెత్తునే.

సు — 4 గ్రోలెద మద్యమో యతివ గోశమియుంచుము దప్పి దాఁపచేఁ.

అమ్మా! మాలినీ!

ఉ. కమ్మనివారుణుల్బలుర ♦ కమ్మలుగా నసుకూరి యుండు నా
తమ్మునిగేహమందు బెడి ♦ దమ్మగు మాడెను దప్పి హేచు పా
త్రమ్మదె కొంచఁబోయిగొని ♦ రమ్మర యమ్మశ్రీమమ్ము నాకునో
యమ్మరో! నీదు రాకకెదు ♦ రైకనుమూయక చూచుచుండెదన్.

మా — (స్వగతము) ఓహో నేననుకొన్నట్లే యైనది.

దైవమా! యిదియెంత సంగనాచి. ఇంతలో దాళగలేని దప్పిపుట్టెనట పుట్టినదేయనుకొందము. కల్లుదాగినంగాని యీ దాహ ముపశమింపదఁట. స్త్రీ లెంతటి జగజంతలైన నుందురనుమాట నామనమ్మునకు నిప్పుడు నిజముగ పొడగట్టినది. దైవమా! ఏనందులకుఁ బోనని చెప్పినచో నేమగునో! అపుడని నన్నుఁ గామించిన వారియింటికి నేనెట్లుబోనేర్తును. పోయినచో నన్నీచుండునన్నుంగని ముందటయట్లు మరుబారిబడి నన్నుమ్మలికంబుఁబొందఁ జేయును. ఇప్పటికిట్లు చెప్పి తప్పించుకొనియెద. (ప్రకాశముగా)

ఉ. అక్కట కల్లుఁ దేర నను ♦ నంపఁగ నీకిఁక బంపరాదె యిం
కొక్కతె గౌరవాధికను ♦ ముజ్వలదర్ధములాచరించి నీ
కెక్కుడు మాననీయుత వ ♦ హించితిగాని నికృష్టదాస స
మ్యక్కరణీయ హేయకల ♦ నాచరణంబున కేసహింతునే.

అమ్మా! నీయంతిపురంబత్యంతనిర్మలచారిత్రవంతంబని మహాంతులతోడి వినియోగంబెంతదుస్సహంబైనను నిచింతంజేరి యింతికాలమును సైరించి సైరంధ్రినై కృపానిరంధ్రంబగు భవద్గౌరవాతిరేకంబున భవన్నియుక్తానేకగౌరవక్రియాచరణంబుల నీచుదికెక్కఁగన్నుసంజ్ఞలమెలంగుచుండుటంజేసి నాకందరికంటె నెక్కుడుచనువు ననువు నొసఁగి యిష్టశిక్షకరణి మిక్కిలి నెల్లిదంబగుపనికి నియమించి మన్నన దక్కఁజేయుటిది యెక్కడిది నెనరు తల్లీ! తొల్లి నీచెంత నుండుకొరి పరుపమ్మునొంగిన తెఱంగు వరపుషమ్ముల దెస నన్ను నియమించననియు నోరుల యిరవులకు నన్నెందులకు చనుదెమ్మనియు సమయమొసంగితివిగాదె తమ్మ శరణమ్ముగా నమ్మి జనమ్ము దుష్టలోకమ్మువలన నేయపాయమ్మును బొరయకుండ నరయు వెరవు యజమానులదిగాదె అమ్మా! నన్నిట్టిరాగున జాలిం బెట్టుట తగవటమ్మా!

సు—(స్వగతము) అయ్యో! యిఁక యేమి చేయుదును.

మూఁడు నాళమ్ములకి మరణమ్ము తప్పదు. మున్నడిగిన వరములన్నియు
నీమొకు వల్లెయని యిచ్చి యిప్పుడు మరితమ్ము కొడిబట్టవలసెవచ్చినది.
అయిన నింకొకమారు చెప్పి చూచెదను. (ప్రకాశముగా)

ఉ. అద్దిర నద్దు జేయఁదగ ♦ నమ్మ! ప్రియమ్మున . ద్యమానగా
బుద్ధి జనించి యల్పులకుఁ ♦ బుచ్చగ సిష్టము లేక నీవు నా
యొద్దర లేని దాసవని యం ♦ నిషమించిన మోముఁజూడకే
పద్దులు సెప్పసాగితివ ♦ పారను గాదది యేటి నేస్తమే.

నాకుద్దు చెల్లించి నాయొద్ద నున్నట్లు పోయిరమ్మ. హేమకళసమ్మ
దేసకీ నెలవాతాయనము నున్నయది గైకొమ్ము పొమ్ము.

(సుధేష్ణ లేచిపోవును)

మా—(పాత్రము బుచ్చుకొని పోవుచున్నది)

(కొన్ని యడుగులు నడచి నిలువబడుచున్నది)

ఇందెవ్వరును లేరుగదా. (నలుదిక్కులు జూచుచున్నది)

లేరు. (సూర్యునివంక జూచి నమస్కరించుచున్నది.)

ఓ త్రయీమూర్తీ! శమితార్తీ.

ఉ. [illegible]డెముగాని భక్తి విన ♦ తుల్యానరించెద నేఁత్రికశుద్ధి నే
నాగుమఁ బాండుసూనులని ♦ సజ్జనదాటనిదాననేని నే
కీచును మూఁడకుండఁ బరి ♦ కించుచుఁ గ్రిమ్మరునంతదాక కా
పాడుము రాఁశికోసరము ♦ నాసనయుం గొనబోయిన చ్చెరక్.

(అందఱును నిష్క్రమించిరి.)

తృతీయాంకము సంపూర్ణము.

శ్రీశారదాంబాయైనమః

# కీచకవధ.



## చతుర్థాంకము.

(సుశీల, చారుమతి, ప్రవేశింతురు)

సు—చారుమతీ! యెక్కడికేగితివమ్మా! నాలుగుగడియలనుండి నీవేమైతివో యనివెదకుచుంటిని.

చా—అక్కా! యింతవఱకునే నెక్కడనేయుంటిని.

సు—మనరాజుగారి చేటుకాలము వింటివా.

చా—అదియేమో! నేవినలేదమ్మా. అట్లనుచుంటి వేమి.

సు—సుధేష్ణమదిరారసంబునకై, యచ్చటి సైరంధ్రి నెఱుంగుదువా

చా—అయ్యో! యెఱుంగనా.

సు—ఆమెను దమ్మునియొద్దకు పంపించినదమ్మా.

చా—ఆమెవచ్చిచాలకాలమైనది. ఇదివఱకెన్నడు వీధిమొగమెఱుఁగదు దేవతామహోత్సవసమయములలోనైన నాసుధేష్ణనువిడచి బయటకిరానమ్మా! అంతిపురమ్మునవారలగాని పరులకంటఁబడి యెఱుంగదు. మానవతియన్న నామెయ్యేసుమా. నీవుమాత్ర మెఱుంగవా అక్కా!

సు—అవునులే. ఆమెను మనరాజుగారు జూచి మోహపరవశుండై—

చారుమతి—అయ్యో, అయ్యో, యెంతదుర్మార్గుఁడు. యితనికేమివింతకాలము పూచిన తంగేడువలె యింటిలో అమ్మగారు. పైగానెందరో భోగకాతలు. ఊఁ— చేటుకాలము తటస్థముయినది కాబోలును. తరువాత నేమిజరిగినది.

సు—ఏమిచెప్పుదును. ఆసైరంధ్రిని వినరానివలుకుల నులికించి

బెదరించి యామె అందులకును వశముకాక వచ్చినదారిపట్టిన నామె వెంటంబడి పోయెను.

చా—అక్కా! యిక మన బోటులితనికి లెక్కా. మానవతుల కిక నెక్కడిబ్రతుకు. యిక్కడి కొలువునమనబోంట్లకు మానప్రాణములు దిక్కా! ఆమె నీకెందుకూడ నట్టిపోయెనని చెప్పితివి. ఆమె యితని కలవడునా.

సు—అదియే సందేహము. ఇకెందు పరుగు పరుగునం బోయి ఆమె కేమియగౌరవ మొనరించునోయని భయంబడుచున్నదానమ్మా

చా—నీకు భయమెందులకు, ఆమె యితనికలవడునా! యెట్లనో గికురించి చివ్వన రచ్చకుంబోయెఁగందు. అమ్మయ్యా! బ్రతికితిని. ఆమెకేమియు భయము కలుగదు. యేమంటివా యిప్పుడాదారినేవచ్చుచు జూచితిని. రాజసభలో మల్లయుద్ధము జరుగుచున్నదమ్మా.

సు—అయినసరే. మల్లయుద్ధమే జరుగుచుండుట నిజమైనచో నాసభలో మహాయోధులుండకపోరు. ఇతనికి జరుగవలసిన ముచ్చటలు జరిగింపక మానరు.

చా—విరటుని సభకు కొంచెము దూరముగాఁ జూచితిని. విరటునియొద్ద కంకుభట్టును దామగ్రంథియు దంతిపాలుఁడు నెందరో యున్నారు. ఇతని నూరక పోనివ్వరు. ఇతనిమాటయెట్లున్న నామె యీతనిపాలం బడకుండ బోగలదు.

సు—ఈమధ్య నొకవంటలవాఁడు విరటునియొద్దచేరినాఁడే! ఆతఁడుండునేమో.

చా—అమ్మా! అతఁడే నేఁడు మల్లునితో మల్లయుద్ధము చేయునటమ్మా వలలుఁడుగాడా అతనిపేరు.

సు—అవును మంచిమాట చెప్పితివి. నామనమిప్పటికి కుదురుపడినది. ఈదుర్ణయము మనయమ్మగారితో మనవి చేయుదము. ఆమె యేదయిన ప్రతీకారముఁ జేయునేమో మనమింక పోవుదముపద.

(అనినిష్క్రమించిరి, ఇదివిష్కంభము)



[రంగము—విరటుని సభామందిరము.]

(విరటుఁడు, కంకుభట్టు, తంత్రీపాలుఁడు, దామగ్రంథి కొందఱు సభాసదులు సభ చేసి యుండఁగా మల్లుఁడు ప్రవేశించును.)

మల్లు—(కైవారము చేయుచున్నాఁడు) శ్రీమన్మహారాజ, రాజాధిరాజమండలమకుట విరాజమాన మణిగణప్రభా నీరాజితపదాంభోజ, వైభవబిడౌజ, నైజప్రతాపదూరీకృతారాతిమండల, దిగ్వ్రాతాజనతాఘనకుచోపరిచేలాయిత కీర్తిసనాథా, మత్స్యమహీనాథ, జయము! జయము!

వి—ఓయీ! నీవెవరు?

మల్లు—మహాప్రభూ! నేను మల్లయుద్ధవిశారదుండను.

చ. తిరిగితి నెల్ల దేశములు ♦ దీర్ఘయశోధనులైన మానవే
శ్వరుల సమక్షమందు సమ ♦ బాహుబలాఢ్యతఁ బేరుఁగాంచి ది
ట్టరులగు మల్లుర న్బడవ ♦ దంచితి నాభుజశక్తి కాత్మ న
బ్బురపడి పారితోషిక ♦ విభూషితుఁ జేయని రాజు లేఁడిలన్.

సీ. అంగభూపతి మును ♦ సారసర్పించిన
చారుమాణిక్యమం ♦ జీరమిదిగో
వంగాధిపతి మెచ్చి ♦ పసదన మిచ్చిన
పసిఁడి మేలిమి పని ♦ పదకమిదిగో
కాళింగ విభుఁడు మేల్ ♦ మేలంచు నొసఁగిన
మాణిముత్తియముల ♦ హారమిదిగో
కాశ్మీరనాథుండు ♦ కాన్క జేయించిన
జాళువా మేల్పని ♦ శాలువిదిగో
నే జయింపని మల్లుఁడీ ♦ యిలను లేఁడు
చూడు నా శక్తి మల్లుఁడీ ♦ చోట నున్నఁ
బిలువఁ బంపుము నాప్రమోల ♦ బెదరు లేక
మల్లఁ జరపినఁ జాలునో ♦ మానవేంద్ర.

వి—(స్వగతము) వీఁడు మహాబలసంపన్నుఁడుగాఁ దోఁచె
డిని. ఇదివఱకు వచ్చిన మల్లులందఱును మాటల బెట్టిదముగాని యీ
తనివలె బలసంపన్నులు కారు. (యేదియో యాలోచించుచున్నాఁడు)

కంకు—రాజా! యూరకొంటివేల! మల్లుని కుత్తరం బిమ్ము.

వి—ఏమని యుత్తరంబిచ్చ్యను. ఈతఁడధికభుజాబలసమన్వి
తుండు. మనయొద్ద వీనికెందు రై జయంబుగొను మల్లుఁడెవ్వండును
లేఁడు. నేటికి మనకు మల్లుఁడు లేఁడనునపయశంబు వచ్చునట్లున్నది.

కంకు—రాజా! నీమాటలు చాల వింతలుగానున్నవి. ఈతఁ
డంత బలసమన్వితుండా! మన యొద్ద నీతని జయించు మల్లుండే లేఁడా!
మన మహానసంబున నుండు వలలుని భుజశక్తి జగద్విఖ్యాతంబై యుం
డ నీ వెఱుంగవా.

వి—అతఁడంతబలవంతుఁడా! మీ రెఱుంగుదురా!

మల్లు—మహారాజా! తమ పాల మల్లుఁడు లేఁడని నాకు ప
సదనంబిచ్చి పంపించరాదా! ఇంతదూర మాలస్యము జేసెదరేల?

కంకు—ఓయీ! తొందర పడెద వేమి. నీకుఁబారితోషికమి
చ్చునతఁడిప్పుడే వచ్చును. అందాక కొంచెము తాళుమోయి.
(విరటునివంకఁ జూచి)

చ. వలలుని నీ వెఱుంగవె నృపాలక గండరగండఁడెల్ల మ
ల్లులమొనముల్కి యద్భుతబలుండు యుధిష్ఠిరుకొల్వులోపలన్
దెలియదు వీని బాహాసము దీర్ఘపరాక్రమసాహసంబులీ
వెలవెల యేల వేగ బిలిపింపుజయింపగ నోపు మల్లునిన్.

వి—పారిపార్శ్వకా! మనవలలుని పిలుచుకొనిరా.

పా—చిత్తము. (అని పోయి వలలుని ప్రవేశపెట్టును).

వి—వలలాంకా! ఈమల్లునితో బాహాయుద్ధం బొనర్చి జ
యంబుపడసి మాకానందము కలిగింపుము.

కంఠు—స్వామికార్యము నిర్వహించుటకిది తగినసమయము. రాజు నానతి నెరవేర్చెను.

వ—చిత్తము (అని మల్లునిదెస పోవును.)

మ—(స్వగతము) ఓహో! యితఁడా, నన్ను జయించువాఁడు. ప్రకాశము) ఓయీ! మల్లుఁడన నేమనుకొంటివి. వంటచేయుట లనుకొంటివా, కట్టెలు విరుచుట లనుకొంటివా?

వ—నిన్నుజూచి పశులకాపరివనుకుంటిని.

మ—క. ఏమనుకొంటివి మల్లుని
సామర్థ్యమెఱుంగ కిట్లు ♦ చనుదెంచెదవా
భీముఁడో, శల్యుఁడో, గాక
నీమాదిరి నరుల నేగ ♦ ణింతునె; ధరణిన్

ఎఱుఁగక వచ్చితివి. ప్రాణములపై నాసయున్నఁ దొలఁగిపొమ్ము కరుణించెదను.

వల—క. నీచుఁడివిగ, యిఱువురిలో
నేనొక్కఁడ గానుఁ బోరి ♦ నిర్వ్యాజబలా
న్యూనుండ నెల్లమల్లుల
మానప్రాణముల గొనెదు ♦ మారిటమిత్తిన్.

ఎవరినైన నేమిసేసెదవు; బకబకలాడక కొక్కెఱుణము పారిపోక చక్కనై నిలుపుము. నే నెవ్వఁడనో తెలిసికొనఁగలవు.

మ—క. సారము కలిగిన నెకుత్రై
పోరితన మొసరించి జయముఁ ♦ బొందఁ దగుఁ గా
ఊరక కాఱుల నఱచుట
శూరతయే దానజయము ♦ చొప్పడ గలదే.

బాహుబలంబు కలదేని వెల్లడించి ప్రభువుల వలన మన్ననఁ బొందరాదా, మాటలప్రల్లదనం బేల? సమప్రదేశంబునకుఁ బోదమురమ్ము. (అని యిద్దఱును నిష్క్రమించిరి.)

కంకు—రాజా! చూచితివా! పుడమిపై మన్ను ఫాలంబులం దాల్చి యొడలిపైఁజల్లికొని యుభయులును యుద్ధంపటు లగుచున్నారు.

వి—కంకభట్టా! చూచితివా మల్లునిసాహసము.

చ. వెరవక బీరువోవక గ ♦ భీరముఁలాడుచుఁ బొంచిపొంచి పై
కురుకుచు నేలగుంగుచును ♦ గొబ్బున డాయుచు వీఁచుం బోరం
బోరి మునుపండ్లుగీటుచు జె♦వ్వల్ జెవుడొందఁగ మల్లఁగొట్టి యా
గరగర మల్లుఁడేచి కడ ♦ క వ్వలాంకుఁ జయింపదా కీడ్క్
ఈతండేమి చేయునో.

కంకు—యీతఁడు వలలునిజయించుననుకొంటి వాని బలహీనునకుఁ బరవడు లెక్కవన్నెలైయుఁగవా.

వి—(తొందరతో) అయ్యో! అయ్యో! కంకభట్టా! నీమాటలు విని నిజముగానమ్మి నిష్కారణముగా వలలునిజంపుకొంటిని వీఁడు వచ్చినది మొదలు నేటివఱకు నేననుభవించిన భోజనసుఖ మమృతాశనులకైన లభింపదు నేఁడది యేమగునో.

కంకు—రాజా! తొందర పడెదవేల!

చ. కులగిరి గోత్రశాఖులకుఁ ♦ గొందలమందిన నందుగాకయీ
వలలుఁడు వీని ఢాకలకు ♦ వాసియుఁ జంకెఁడు నట్టివాఁడె య
య్యాలవు చలమ్ములింకొకని ♦ కబ్బుట దబ్బర చూచుచుండుమీ
వ్వలనఁ జయంబు కల్గునొ నృ ♦ పాలక యిద్దరి తారతమ్యముల్
వహ్వా, వలలాంకా! నన్ను నీరాజుచే మాటలు పడకుండఁ జేసితివిరా! రాజా! చూడుము మల్లు డీమారేమగునో.

చ. కదియగ వచ్చు మల్లుని న ♦ కంపనుఁడై వలలుండు బల్మిచే
వదలక పట్టి యెత్తి పువుఁ ♦ బంతి విధంబున గిఱ్ఱుగిఱ్ఱునన్
జదలునఁ ద్రిప్పి త్రిప్పి చెయి ♦ జార్చెను వహ్వారె నోట నెత్తురుం
గుదుపలుఁ గ్రక్కుకొంచు మహిఁ ♦ గూలెను గొబ్బున బొబ్బ వెట్టుచున్

(తెరలో) రాజా! చచ్చిపోతిని, చచ్చిపోతిని.

కంకు—రాజా! చూచితివా! వలలుని సాహసము నేనెఱుంగక యూరక చెప్పితిననుకొంటివా!

(తెరలో) మహాప్రభూ! నన్ను విడిపింపుఁడు విడిపింపుఁడు.

వి—(సంతోషముతోఁ దలపంకించుచు) పారిపార్శ్వకా! నీవు పోయిమాయాజ్ఞను వలలునకుఁ దెలిపి మల్లుని తీసికొని రా!

(వలలుఁడును మల్లుఁడును చేతులు పట్టుకొని పారిపార్శ్వకునితోఁ బ్రె॥

వ—(సంతోషముతో) మల్లా, నీబీరము లిప్పుడేమైనవి.

మ—మహారాజా! యితని నేనెఱుఁగక వచ్చితి. మీమల్లునికి నేనోడితి.

వ—మల్లా! మీమల్లుకి నేనోడితినని మమస్కారము.

మ—మహారాజా! మీమల్లునకు నేనోడితి; (అనినమస్కారనును)

వ—మల్లా! యింకనెప్పుడును యెదిరిబలంబు నెఱుంగక యిట్టి సాహసంబునకుఁ జొరబడకుము. నేనెవ్వండనో యిప్పుడైన తెలిసెనా, యింకనైన బుద్ధిగలిగి మసలుకొమ్ము.

వి—వలలాంకా, మాకీర్తికన్యను మల్లుఁడపహరించకుండ కాపాడితివి. వీని విడిచి పొమ్మనుము.

వ—(మల్లుని విడుచుచున్నాఁడు.)

మ—మహారాజా! పోయెదను (దేహమును దులుపుకొనుచు పోవుచున్నాడు.)

(తెరలో రోదనధ్వని.)

(అందఱును మహాశ్చర్యముతోఁ జూతురు.)

మహానుభావులారా, ఆర్యులారా, నన్నీదురాత్ముఁడు నెంటాడించి యలజడిఁ బెట్టుచున్నవాఁడు రక్షింపుఁడు, రక్షింపుఁడు, (అని మాలిని విరటునిసభలోఁ దొందరతోఁ బ్రవేశించును.)

కీ—(పరువునవచ్చి కాలితోఁదన్నును.)

(కీచకుని ఆకాశయానమున రాక్షసుఁడు తన్నిపోవును.)

కీ—(లేచి దేహము దులుపుకొనుచున్నాఁడు.)

మా—అయ్యో! యెంత యాపదవచ్చినను నన్ను కాపాడువా రెవ్వరునుగనపడరు దైవమా (అని యేడ్చుచున్నది.)

వ—(కోపముతో) కీచకునిఁజంపుటకై సమీపమునందున్న వృక్షమును పెల్లగింపఁ జూచుచున్నాఁడు.

కంకు—

మ. వలలాంకా! కలవెన్ని నీరసతరు ♦ వ్రాతమ్ములీచెంగట౯
బలుగుల్ గూర్కెడునిందుశాత్రియగుచు ♦ నొక్కత్తమ్ములైవచ్చిపాం
థుల పాలింటికిఁ జల్లవందిరిధిగ ♦ న్నుంబండువై యొప్పు నీ
ఫలవృక్షమ్మును వంటకట్టెలకునై ♦ భంజింపఁగాఁజెల్లునే.

(వలలుఁడు తలవంచుకొనును.)

మా—అయ్యో! యెంతయాపదరానున్నను నన్ను కాపాడువాఁడు లేఁడా! (అని యేడ్చును.)

మ. అరివీరక్షణానప్రచక్షణులు, ధ ♦ ర్మాసర్మనిర్ధారణా
దరులున్మత్పతులేవురుత్తములుగల్ ♦ ధర్వ్యేల్ ననున్నీచుఁడౌ
క్రూరుఁడిక్కైవడిఁబట్టిజేటు ♦ వడుపన్నొంచుగోపింపరె
వ్వారి యాండ్రింక ధరిత్రి నుండురు పరీ ♦ భావంబు లేకుండగాన్

అక్కటా! పరమసాధ్వినై పతివ్రతాగుణగణాలంకారసంచారిణినైన నన్ను నీకొలువున నందఱుగనుంగొనుచుండ నీకీచకుండెన్నండును నెట్టియుంగానలు పడనియిట్టిపాట్లు పఱుప నోర్వరుఁడైన నధర్మంబునఁజాలెను. ఆహా! నేనొనరించినపాపమేమి దైవమా! నేనెంత చేసినను దుదకునన్ను నేనె యుపశమించుకొనవలసివచ్చెఁగానిమున్ను ఈకేశంబునకు నీవిరటుండధీశుండు గావున నీతనికడ నిది యంతయు విన్నవించిపోయెద. (విరటునున్నచోటికిఁ బోవును.)

మా—

ఉ. ఇమ్ముగ నిన్నినాళ్లు వసి ♦ యించితి నీగృహమందు నెమ్మనే
పిమ్మట లేక నేఁడిచట ♦ బెల్కురి కావఁబడ్డె పదప్రహా
రమ్మొనరింప నందఱుఁది ♦ రంబుగ జూచెదరేమి కోపమా
కిమ్మనవైతివిప్రుబరి ♦ కింపఁగ నాదగు పాపమూన్నృపా.

(పిరటును తలవంచుకొనును.)

కంకు—

మ. తెరవా, యీసభ నెల్లవారుచుఁదరి ♦ శ్రీనాయకుండున్ భవ
చ్చరితంబున్ గనులార గాంచి రలగం ♦ ధర్మ్యాల్పవద్వల్లభుల్
దరి గాకుండుట కోపగింపరిటనే ♦ లాదూరగావారలం
ద్వరగాఁ బొమ్ము సుధేష్ణపాలికిచట ♦ న్బల్మాటలింకేటికిన్.

మా—హా పరమేశ్వరా! నే నెంత(అని యేదియో చెప్పఁబోవును)

కంకు—(కోపముతో)

ఉ. ఎంతటి చేటు మూడినన ♦ రే కులకాంతలు కొల్వులోనికే
తెంతురె నూత సిగ్గు వల ♦ దే పలుఁ బోకల బోవుచీగతిం
గొంతుక పెద్ద చేసికొన ♦ గూడున టే నటి యట్ల నాట్యపుం
గంతులువైచెదేల కుల ♦ గౌరవమున్ దొలఁగింప నెంచితే.

చాలు, చాలు, నీపాటికిఁబొమ్ము.

మా—చ. పతికనుకూలవర్తనము ♦ భామలకెందును లెస్సగాదె మ
త్పతి నటుఁడౌటచేఁబరిచి ♦ తంబొనరించితిఁ గొంతనాట్యపుం
గతియును కంకభట్ట విను ♦ కాదన నేటికి నీదుపల్కులేఁ
గితవుని కాలినైతిఁ దిల ♦ కింపగగౌరవ మెంచుఁ గల్గెనన్.

(పోవుచు) నన్నీ దురాత్ము మందిరంబునకుఁ బుత్తెంచిన ఆజగ
ఝంపతో నింతయు విన్నవించెద. ఏమిరాజ్యాము, యేమి రాజనీతి!

యేమి ధర్మాధర్మవిచారణ ప్రాగల్భ్యము, ఆహా! యెవరూరకున్నను, కాగలకార్యము గంధర్వులే తీర్పఁగలరు! (అనివిచారించుచుపోవును.)

విర—కంకభట్టా! నేనెంతదుర్మార్గుఁడనో గాంచితివా? అన్యాయముగా నీసైరంధ్రి నీసభ మనలనైన చూచి సందేహింపక యీ మూర్ఖుఁడిట్లు చేటు పఱుప ప్రతిక్రియ చేయఁదగియున్నను మోమోటంబునను బంధుత్వాభిమానంబునను నౌదాసీన్యంబు వహించితి. నెంతపాపాత్ముఁడను.

క. దురితాత్మునిదండింపని
నరనాథునకయ్యఘంబు ♦ నన యారవపా
ట్లురితంబుపొరయుఁదాన
న్నిర కుమ్మరునంద్రుధర్మ ♦ నిష్ఠితబుద్ధుల్.

(అని విచారించును)

కంకు—రాజా! విచారింపద వెందులకు? ఈదుష్టుండు వధ్యుండైనను నీకొఁడువంక చుట్టము గుటచే సాధురక్షితుఁడయ్యె. ఇంత మాత్రమున నీతని నిరపాయునిఁగాఁ దలపోయకుము. ఈమె పాతివ్రత్యము మున్ను నేనెఱుంగుదును. గంధర్వులేవురసహాయశూరులీసతి నహోరాత్రంబు లరయుచుందురు. నేఁటి రేయితని నామావశిష్టునిఁ జేయక మానరు. నీమాట నీవు దక్కించుకొంటివి. ఇదియునుఁగాక ధర్మాధర్మంబు లెఱింగి రాజ్యరక్షణంబొనరించుట ధర్మస్వరూపుండగు నజాతవైరికొప్పుఁగాని యితరులకలవియగునె? సమయానుకూలంబుగా రాజ్యతంత్రంబులు జరిపికొనవలయుఁగాని యంత యోచించి, నడుప నెవ్వరికి శక్యంబగును.

వి—(తలపంకించుచు సభ చాలించును.)

(అందఱును నిష్క్రమించిరి.)



శ్రీ శారదాంబాయైనమః

# కీచకవధ.



## పంచమాంకము.

[రంగము—వంటయిల్లు]

భీముఁడు నిద్రపోవుచుండగా విచారించుచు మాలినిప్రవేశించును.

మా—ఆహా! నాథర్త ఱాపఁటయింట గటికినేలం బండుకొని నిద్రపోవుచున్నవాఁడు మెల్లనఁబోయి లేపుదునా! - యీతనికి నిద్రాభంగము చేసితినేని కోపగించునేమో! యీతనికి మాత్ర మిప్పుడు నిద్దురవచ్చునా; రాదు ఊరక కన్నులు మూసికొని పండుకొనియున్నవాఁడేమో మెల్లనఁబోయి లేపుదును (అని భీమునిదగ్గ ఱకుఁబోయి చేయివైచుచున్నది)

భీ—(ఉలికిపడి లేచి కన్నులు నులుముకొనుచుఁ దొందరతో) ఎవరునీవు?

ద్రౌ—ప్రాణనాథా! నేను! తొందరపడెదరేల?

భీ—ద్రౌపదివా!

ద్రౌ—చిత్తము.

భీ—(స్వగతము) ఇప్పుడీమె తనపడిన పరాభవమునకుఁ బ్రతిక్రియ నాచేఁ జేయించుటకై నన్ను బోధింపవచ్చినది కాఁబోలును. (ప్రకాశముగా) చెలీ! యీకాందారి ప్రొద్దుననిందుల కేలవచ్చితివి. నీరాక యెవ్వరు నెఱుంగరుగద? ఇన్నినాళ్ళకు నెనరు కలిగి భీముని పాటు లారయ వచ్చితివా! ప్రాణనాయకీ! యిటుఁ గూర్చుండుము. కలకలలాడు నీనెమ్మొగము దుఃఖము మూర్తీభవించినయటు లుండుటకుం గతమేమి?

మా—(స్వగతము.) ఆహా! యీతఁడు నాకెఱుక పట్టించుచున్నవాఁడు. (ప్రకాశము) ప్రాణనాథా! కీచకుని యాగడము సకలంబునుఁ గొల్వునఁ గన్నులారఁగాంచియు నేమియు నెఱుంగనివానివలె నన్నడుగుచుంటివా? సరిసరి, యిఁక నీతో నేనుఁ జెప్పికొనినను జెవిటివాని చెవిలో శంఖమూదినటులె యగును. అయినను నాకుఁ జెప్పుటవిధి గానఁ జెప్పిపోయెద నాలకింపుము. నిన్న నీవిరటుని మఱంది యప్పను జూడవచ్చి ముంగిటఁ బూవుఁబెత్తులు సవరించు నన్నుఁ గనుంగొని మోహపరవశుఁడై—

భీ—ప్రాణేశ్వరీ! నిన్నుంగని యాదురాత్ముండు మరులుగొనియెనుగా!

ద్రౌ—ప్రాణనాథా! అన్నీచుండు తన్ను దానే యెన్నో విధంబుల పొగడుకొనుచు నన్నుంగని వినరానిపలుకుల నులికించుటయు నా చెవులకవి ములుకులై వానితో మారాడుట కిచ్చగించక యూరకుంటిని.

భీ—వాఁడంతటితో విరమించిపోయెనా ప్రాణనాయకీ!

ద్రౌ—ప్రాణనాథా! వాఁడట్లుపోయెనా నాకింత దుఃఖమేల! ఈయర్ధరాత్రింబున నీకు నిద్రాభంగంబొనరించుటేల! అక్కలపాంపనుఁడంతటితోఁబోక—

శా. భవదీయాజ్ఞయె &c. &c. (అనుపద్యమును చదివెను)

భీము—ప్రాణేశ్వరీ! ఆదుష్టుండు నిష్క్రాంతుఁడయెనా, తరువాత నీవూరకుంటివా?

ద్రౌ—ప్రాణనాథా! నేను కోపంబాపుకొనలేక దేవర బాహుబలంబూతగా నమ్మి నాకర్మమును నేనే నిందించుకొనుచు దైవమునుఁ దిట్టుకొనుచు—

శా. ఓరీకీచక &c. &c. (అనుపద్యమును చదువును) అనియంటిని.

భీ—నాకు భార్యవై అంతమాత్రమనఁగలిగితివిగదా! నీకింక భయములేదు? తర్వాత నేమిజరిగినది చెప్పుము.

ద్రౌ—ప్రాణనాథా! వాఁడంతటఁబోక ముందటికంటె నెక్కుడుసాహసంబున మిక్కుటంబగు విరాళింగొనుచు మిక్కిలి ప్రల్లదంబులు పలుకుచు నన్నుం బట్టుకొన యత్నించుటయు నాతని జతనంబు విఫలంబుగా నేనందుండుట యయుక్తంబగు యవలకుం బోలంగితి. వాఁడును నన్ను వెంటఁబడినను నేను మరల వానికంట బడక పోవుటచే మాయప్పతోఁ జెప్పి నీపనిపట్టించెదను లే చూడుమని తర్జించుచు సుధేష్ణచెంగటికిం జని యప్పయుం దానును గొండొకవడి గుసగుసలంబోయి యెట్టకేలకు లేచిపోయెను. ప్రాణనాథా! సుధేష్ణ యెంతదుర్మార్గురాలో చూఁడుము. అప్పుడా యమ్మ మిథ్యాదాహం బభినయించుచు వగలు గులుక మిన్నువిరిగి మీఁదబడినటుల తనపుట్టి మునింగినటుల ప్రాణములప్పుడు పోవుభంగి నాయందపూర్వస్నేహం బుట్టిపడ దీనస్వరంబుగ నన్నుంబిలిచి తమ్ముని గృహంబునకరిగి కల్లు తెచ్చిపెట్టుమని బలవంతపెట్టినది. దానికిఁ బోలుత నేనియ్యకొనక యాసుధేష్ణ పరిపరివిధంబుల నిర్బంధించుటం జేసి మిా బలంబు నమ్ముకొని సుధేష్ణయిచ్చిన కాంచనచషకంబుఁగొని యానీచునింటికిఁబోతి.

భీ—(పటపట పండ్లుకొఱుకుచు) సుధేష్ణ సుశీల యనుకొంటిని ప్రాణేశ్వరీ! యిది త్రాగుబోతా ?

ద్రౌ—ప్రాణేశ్వరా! అట్లనకుఁడు. నన్నుఁ దమ్ముని యింటికిఁ బంపుటకై పన్నిన పన్నుగడగాని యిదినిజముగా దాహమును, దాని యుపశాంతికై కల్లుత్రావుటయనియు నూహింపరాదు.

భీ—తర్వాత నేమిజరిగినది ప్రాణేశ్వరీ!

ద్రౌ—నన్ను నాకీచకుండు గనుఁగొని ప్రాణేశ్వరా! యేమని చెప్పుదును. నోటికిరానిపలుకులు పలుకుచు నన్ను బలాత్కరింపఁ దలంచుటయు నేను—

భీ—ప్రాణనాయకీ! నిన్ను వాఁడు పట్టుకొనెనా!

ద్రౌ—లేదు నేను పరుగుపరుగున సుధేష్ణయింటికై వచ్చిన దారింబడి పోవుచుండఁ దైవవశంబున మీరందఱు రాజసభనుండిరని యెఱింగి భయాతిరేకంబున మీరున్న యెడ కప్పుడవచ్చితిని. కడపటి వృత్తాంతమంతయు తమరు కన్నులారఁజూచినదియే. అదియునుమరలఁ జెప్పవలయునా! ప్రాణనాయకా! నాయుదంతమంతయు నింతియే వింటివా? మనసుదీరెనా! (మోమున చేతులుంచుకొని విచారించును

భీ—ప్రాణనాయకీ! విచారించి యేమిచేసెదవు? నీభర్తలట్టి పరాక్రమహీనులగుటచే యిట్టియిడుమల పాలైతివి. ఊరుకొనుము. (అని చేతులనుఁదీసి తనయుత్తరీయముతోఁ గన్నీరుఁదుడుచుచున్నాడు

ద్రౌ—(విచారముతో)

ఉ. మున్నల దుస్ససేనుఁడతి ♦ మూఢతఁ గ్రొమ్ముడి పట్టియీడ్చె మీ
సన్నిధి నాజయద్రథుఁడ ♦ సంగతమున్నలుపంగఁబట్టియు
న్నిన్నకఁ ద్రోసి పుచ్చితిరి ♦ నేఁడిటులయ్యెఁ గదయ్య నాకుఁ గీ
డన్ననుఁ గ్రొత్త యెట్లు భవ ♦ దగ్రజుఁడాగతి వాఁడు గావునన్.

ఆర్యపుత్రా! లోకంబులోఁ గులభామినుల మొఱ పెఱవారైన నరయవలయునని పెద్దలు సెప్పుదు రయ్యాని సభలయందలి పలుకులుగాబోలును; గాక ప్రాగల్భ్యములైయుండునా, యెక్కడి ధర్మములు; యెక్కడినీతులు; యెక్కడిబుధులు; యెక్కడిరాజులు క్రియాపర్యవసానంబున నన్నియును నేటిబీరకాయలుగదా. (అని విచారించును)

భీ—ఆర్యురాలా! విచారింపకుము. నేనప్పుడు కోపమందియును మాయన్న వలదనుటచే నూరక శాంతించితి నసఃకొంటివా! యిటువినుము.

మ. బలిమి న్నీచకుఁడిట్లు నిన్బరిభవిం ♦ పంబుట్టి యంతాతకు
న్గోలదుల్ మీరుచు నున్న మామక మహా ♦ క్రోధాగ్ని[illegible]దకో

జల్వమా ధర్మజువాక్యవృష్టివలన ♦ జల్లారదే న్వెల్మిడి
స్ఫుటపుంబో విరటు న్నపుత్రికముగాఁ ♦ గాంతాశిరోరత్నమా.

అట్లయ్యేనేని మనలఁ బాండవులఁ గాఁ గుర్తెఱుంగుటయును దానంజేసి మనమెప్పటి యట్లఁ గానలపాలగుటయుఁ దప్పదు. అప్పుడాయడరంతయు మనమిద్దురమును దెచ్చినయదిగా నెంచి యవ్వ్యపరాధంబు మనయిద్దరి నెత్తిపై మోపెట్టుదురు. ఆలోచింపుము. కావున ధర్మాత్ముండగు ధర్మసుతుని నిందింపఁబని కాదు. వేగిరపడుటయునుం గర్జంబుగాదు. కీచకుండు వంటయింటికుందేలుకదా! వీనింగడఁదేర్చుట కెపుడుమాత్రిముమిగులఁ బడియెనా?

ద్రౌ—ఆర్యపుత్ర! హేమాచలధైర్యసారుండగు మీయన్న సద్గుణంబులువర్ణింప నలవియగునే; నేనెఱుంగనిదాననా! నాపడినపరాభవపరంపర దుస్సహంబై హృదయంబు కలతంబారుటయు నేనట్లంటిని. ఇదియాకర్ణింపుము.

ఉ. ఈతఁడె కీర్తిఁ డేసరిమ ♦ రెవ్వఁడు నేర్చు నజాతశాత్రవ
ఖ్యాతిఁ దనర్చు దిగ్విజయ ♦ మట్లొనరింపఁగ, రాజసూయము
ల్పేరరవైభవంబున ♦ మహేంద్రముఖామరలోకసమ్మదో
పేతముఁ జేసి కీర్తిఁ గనె ♦ యింతురె? యీతఁడు దక్క నొండొరుల్.

ఉ. అమ్మహనీయుఁ డిట్టి విరటు ♦ నండనుఁ జేరి పరాక్రమాతిహీ
నమ్ముగఁ జేసి బ్రాహ్మణుఁడ ♦ నందగి జోగులభంగిఁ గావిప
ట్రమ్ములఁ దాల్చి తేఁకిము ♦ దమ్మెనఁ గూర్చుచుఁ బేఱుమాలి తా
నమ్మెయి నుండగాఁ బ్రతుక ♦ నయ్యెను నాకుఁ జిరాయురున్నతిన్.

ఆర్యపుత్ర! యాతనిఁ జూచినప్పుడెల్ల నాహృదయము చేయి పెట్టికలఁచినట్లగుచుండు నేనేమి జేయుదును.

మ. కరితుండాయుతసారబాహుధురముల్ ♦ గర్వోన్నతారాతిని
ష్పత్రాకంతకఖణ్డనాభికరముల్ ♦ సోఁపాండు మన్నట్టిని

కరముల్వంకర వట్టొట్టియలుము ♦ కన్నెత్తి యట్లు జూచుచుం
బరియల్లాడకు నాదు చిత్తము శిలా ♦ ప్రాయంబు ప్రాణేశ్వరా.

మత్స్యాధినాథుం డంతఃపుర కాంతలకు సంతసంబొనర్పం దల పునవివేకంబు మాలి కసికరంబు వీలి మత్తగజంబులను గ్రోల్పులుల నొక్కొక్కపరిం గారుఁబోతులను నీకుమూర్ద్ది కయ్యంబునకు డికొలుపునపుడు నేను సుధేష్ణతో నందుండి నీకు భరంబై యలసుండవైన తరి విషాదంబు నుద్ధతుండవై బిరుసుతనంబుం జూపుతరి ప్రమోదంబునుం బొందుచుందు. నాముఖలక్షణంబుల వీక్షించి యక్కడి వారందరు నీయందు నామనము ప్రేమాయాధంబనియు నెఱుఁగాదనియుం బరిపరివిధంబులఁ గుజగుజలంబోవుచుందురు. అదియటులుంచుము.

సీ. శరణాన్న యరినైన ♦ సంరక్షణముఁ జేయు
బిరుదంబుఁ దాల్చిన ♦ సరసుఁ డెవఁడు
సత్తుచే నెఱిఁగిన ♦ గిత్తతత్తడిరొత్తు
నెత్తి గాండీవమున ♦ మొత్తెనెవఁడు
తనుఁ గాంచి వలచిన ♦ వంత యూర్వశినైన
వలదంచు ధీరతఁ ♦ బలికెనెవఁడు
దేహమ్ము సాముగ ♦ ద్దిమ్మయందుపవసింపఁ
బాశుభవంబుఁ గాంచి ♦ వరలెనెవ్వఁ
డట్టి నీతమ్ము డీచ్చోట ♦ సనదయగుచు
నాడుబిడ్డలకెల్ల నృ ♦ త్యములు గరపి
పొట్ట నిండించుకొనుచుండఁ ♦ బొలుపుఁ దక్కి
యుండగాఁ జూచి యెట్లు ♦ లోర్తుఁ జెపుమ.

ఆ. ఘోర్వ్యన్నతుల గోజాబలముల ♦ మ్యార్థ్యానుకూలార్జవ
మాధాన్యధ్రమి ధౌసుపదనులు నా ♦ ప్రియ్యభిగినిర్ఝలనా

సాహసకృత్యములు నయ్యశోధిక ప్రశంసల్ జూడ మాద్రీసుత
స్వాధీనమ్ములు చెప్పగాఁ దరమె నా ♦ థా; వారి చారిత్రముల్.

ఉ. వారలలోనఁ బెద్దకని ♦ వైఖరిఁ గాంటినె లేదొ యయ్యయో
పేరు ప్రతిష్ఠ మాలి యిరు ♦ పేద విధమ్ముల నశ్వపాదియై
తీరుచు మారిపో నొక ♦ తేరువఁ గాంచుము వానిఁ జూచిన
న్వారక కంటి నీరు పగ ♦ వాసికి నైననుఁ బుట్టకుండునే.

కానకు వచ్చునాఁడు తన ♦ కంబున నస్సని మీఁకు తల్లియ
మ్మా నకులానుజుండు సుకు ♦ మారుఁడు మారుఁడు రూపసంపద
స్వానిని నెట్లు చూతొ? లల ♦ నామణి కన్నులనీరు నించె నీ
లైన తెఱంగు నన్వనము ♦ నందొనఁ గూర్చితి వానికిన్నియున్.

ఇప్పుడజ్ఞాతవాసమున నున్న వారమగుట వేనతిసెఁ గన్నెత్తి చూడనైన వలనుపడదయ్యెనని చింతిల్లుచున్న దాన నేనేమి చేయుదును. అతండు సింగారమ్ము వమ్ముగా నివ్వెరటు పాల నాలగాపరియై తలఁదాచుకొనియున్నవాఁడు. ఆహా! మాలవిధి యెంతటి వారికి నెట్టి యాపదలు గలగించుచున్నవాఁడు. ఇంక నా బాముల కొంచెము తెలిగించెద దయచేసి వినుము.

ఉ. పుట్టినిల్లు నబ్బురంబుగ స ♦ ముజ్జ్వలవిక్రముతైన మీకు నే
బట్టవుఁ దేవి నైతి గుణ ♦ వంతులఁ బుత్రులఁ బొందియెందు నె
వ్వట్టున నీఁడు తేరనెడి ♦ పాటి యశంబునుఁ జిక్కఁబట్టి యి
ప్పట్టున నిట్టి నవ్వగల ♦ పాలయితి న్విధిచెయ్యి రక్కటా.

మఱియును.

ఉ. ఈయిలఁ జన్మమెత్తి పని ♦ యేమియుఁ జేసి యెఱుంగ నిప్పుడో
వేయి విధంబుల న్నలుగుఁ ♦ బిండులు నూరుట చందనమ్ములం
దీయుట పూసలల్ సొగసు ♦ తీరఁగఁ గూర్చుట నాదు చేతుల
న్నాయలు గాచెఁ గాదు మిది ♦ నాకురరష్టవ్రేళ్ళల్లుఁగన్.

(ద్రౌపది తన హస్తములను భీమునకుఁ జూపుచు తన శిరమును భీముని తొడపైఁ జేర్చి విచారించును)

భీ—(ద్రౌపది శిరముపై తన శిరము నుంచి విచారించును.)

ద్రౌ—నాథా! విచారించిన ఫలము లేదు మాయజూదంబు మనల నింతవరకుఁ దెచ్చె. అమ్మహాత్ముఁడు నలజడిఁ బాలయ్యె, విధివిధానంబ ననుభవింపక తీరునే! యిది యునుగాక.

తే. గీ. ధర్మశీలమ్ములైన జనులు స్వ ♦ కర్మవశగు
లగుచు సుఖమును దుఃఖము ♦ ననుభవింతు
రనెడి యార్యుల వచనంబు ♦ లనృత మగునె
సలిపితి నఘమ్ము దుఃఖభా ♦ జనమ నైతి.

నాథా! కడపటి మాట చెప్పెదవినుము పలుమాటలేల!

మ. చరితార్థంబున కేల చింతిలగ నా ♦ చండాలుఁడిం కెవ్వఁడె
వ్వరికి న్పాటులఁ బెట్టకుండ నతని ♦ న్భంజింప వైతేని ని
త్తరి నీయాన భవత్సమక్షమున ♦ మత్ప్రాణంబులన్వాహ్నికే
నురికే న్ఖురికే న్విషమ్మునకు నే ♦ నోలి న్నివేదించెదన్.

భీ—(నవ్వుచు) ఆర్యురాలా! యీ చిరుత కార్యంబునకు నన్నింతముట్టఁ బలుకవలయునా! నేను కన్నులారఁ జూచుచుండ నిన్ను పరాభవించిన ఖలుని నప్పుడ వధియింపని యపరాధంబు చాలదే! యింక నేను వానిఁ దెపో యమూరకున్నచో లోకంబున నతులవంతల నింక నెవ్వరు బాప నోపుదురు. నీవు విచారింపకుము. లెమ్ము! నామాట లాదరింపుము.

ద్రౌ—(లేచి కన్నులు తుడుచుకొనుచున్నది.) ఆర్యపుత్ర! మీరేమిచేసినను సరే?

భీ—ఆర్యురాలా! నేనేమి చేయుదునో వినుము.

ఉ. ఎల్లి సమస్తభంగుల న ♦ హీనపరాక్రమ మొప్ప గీచకుం
ద్రుళ్లడగించి నీకుఁ బరి ♦ తోష మొసర్తు నజాతశాత్రవుం
డల్లన నడ్డమైనను ద ♦ యామతి రోడను నీవు వల్దనన్
మళ్లడు భీముఁడింక వగ ♦ మాలి వెసం జనుమంగనామణీ.

చ. నలునిపిరుంద ఘోరవిపి ♦ నంబుల నాదమయంతి రాముతోఁ
నల జనకాత్మజాత కల ♦ శాత్మజుతోఁ దశధర్మపత్ని పే
రలజడి పాలుగారె సుఖు ♦ లైరి పదంపడి వారె యట్లని
శ్చలతర వైభవంబుల నె ♦ నంగెదు నెమ్మది సైపు మాపదల్.

(తెరలో కోళ్లుకూయును.)

భీ—ధ్వని నాలకించి తొందరతో.

ఉ. ఓ మెలనాగ కీచకుడ ♦ యోగ్యుఁడు నేటికి కాలువీటికిం
బోయెడు కాలమున్నదియ ♦ ము న్నెరవేర్చెడు నట్టికాలముం
డాయఁగ వచ్చెనంచు నిక ♦ టమ్ము గృహమ్ములనుండి కొక్కురో
కోయనుచ న్ద్రిదివారముగఁ ♦ గూయదొడంగెను దాగ్రుమచూడమాల్

(ఇద్దఱును దొందర పడుదురు)

ద్రౌ—అయ్యో! తెల్లవారుచున్నది. నన్నేమిచేసెదవోసు
మా! కీర్తియైన నపకీర్తియైన పురుషుని యధీనమై యున్నది. (అని వె
ళ్లబోవును.)

భీ—(చేయిపట్టుకొని) లలనా! చెప్పదగినదియంతయు మిగిలి
యేయున్నది. పోయెద ననెద వేల తెల్లవారుచున్నదని భయంపడకుము
ఇంకనయిదారు గడియల రాత్రియున్నది. ఇది తొలికోడికూత నేనేమి
చేయుదునోయని మనంబున సంశయింపకుము.

మ. అలదిక్పాలకులెల్ల రొక్క మొగమై ♦ యాజి న్విజృంభింపనీ
వలదంచు న్మనవాఁడె యడ్డుపడనీ ♦ వారింపనీ యగ్రజుం

డలుకం బూసితిఁ ద్రిప్పనాదరముగా ♦ దబ్జాక్షియక్కీచకు
న్దల ఖండించెద దాఁక నాకుఁ గని ♦ ద్రాహారముల్ త్యాజ్యముల్.

అలనా! దుర్యోధనాదులు మద్గదావ్యాపాదితులయ్యెడు దాఁక నాస్వాంతంబు దురంత చింతాక్రాంతంబై పరాభవింపక నిమగ్నంబైయున్నయది. మనకింక యజ్ఞాతవాసంబుఁ గడుప నొక్క మాసంబు కడమయున్నది. భగవదనుగ్రహమున పదునొకండు నెలలు సెల్లినవి. ఈదినంబులుఁ గడుపఁ బడిన మనయాపదలనుఁ గడకోసరిల్లెడును. అది యటులుంచుము. ప్రకృతముఁ జెప్పెద మరచిపోకుము. అక్కీచకుండు విరహవేదనాదోదూయమాన మానసుండు కావున గ్రిమ్మరనెల్లియును నిన్నుం బరిభవింపరాక మానడు. నీవును వానికి భయంపడి వ్యతిరేకమ్ములు పలుకక క్రమక్రమమున నియ్యకొనుట గానుపించి నృత్తాగారంబు సంకేతంబుగాఁ జెప్పి తానొక్కండ నిశీథంబైనతరి జనుదెమ్మని చెప్పుము నేనంతకుముందుగా నాస్నృత్తాగారంబునం బ్రవేశించియుండి తమకంబున వచ్చునాతనిపై సాళువంబు కరణి నుఱికి నటనాగారంబు మత్పదాఘాతంబుల నంచలింప మదీయహుంకారంబుల భూనభోంతరాళంబులు ప్రతిధ్వనులీన వానిఁ దెగటార్చెద.

ద్రౌ—ఆర్యపుత్రా! దేవర సాహసమున పరాక్రమము నంతయుఁ జూపించిన సమయభంగంబగును; మీయన్నదమ్ములగతి మీరును నౌదాసీన్యము వహించుటయే యిప్పటి తెఱంగుఁ జూడ నుచితము, అట్లు కాదేని నన్నిచుని విచిత్రగతి వధియింపుడు. కాకున్న నూరకొనుడు మీకిదియే నమస్కారము, పోయెదను. (అని పోఁబోవును.)

భీ—(చేయిపట్టుకొని) కాంతామణీ! పగసాధించుట యవనేమనుకొంటివి. ఇరువుర మెదురైన నెట్టులగునో! సాధ్యమైనంత రహస్యముగా చిత్రగతినే వధియింపయత్నించెదను. (ద్రౌపది చేయిప

ట్టుకొని) నీవిందుండకుము. నావలుకులు మరువకుము (అని సాగనంపు చున్నాఁడు.)

భీ—అబ్బా! రాత్రియంతయు నీమెకోవేగితిని కొంచెము సేపు పండుకొందునా?

(తెరలో)

కంచుకి—

చ. సవసవ చిమ్మచీకటులు ♦ సన్నగ సన్నగ వీఁడెనల్లఁజ
క్కవకవ జోడుఁ గూడె తమ ♦ కంబున వెన్నెల పుల్గులోఁడెక్కె
రవిణి విరాళిమాడె విట ♦ రాజికి నెమ్మది గోఁడు మూఁడెఁ గ
మ్మనలపుఁ దెమ్మెరల్ దురుసు ♦ మాలవలెన్నడయాడె నద్దిరా.

భీ—అయ్యో! తెల్లవారిపోయినది యింకనిద్దురయేల కాల్యములం దీర్చుకొనవలయు.

(అని నిష్క్రమించెను.)

---

శ్రీశారదాంబాయైనమః

# కీచకవధ

## షష్ఠాంకము.

[రంగము ఉద్యానవనము]

(కీచకుఁడు విరహముతోఁ బ్రవేశించుచున్నాఁ.)

సీ. అతివినయుఁడు నా, ♦ యప్పగారింటికిఁ
బోవఁగాఁ దనకేమి ♦ పుట్టె మనిఁగె
పోఁడెఁబో నాయింతి ♦ పొల్పు నాకోఁ జూఁ
గ్రిచ్చినగతిని వా ♦ గ్రువ్వనేల
వాఁడ్రుచ్చెఁ బో దాని ♦ పైఁబాళిఁగొని నేను
తిన్నఁగఁ జని కోర్కెఁ ♦ దెలుప నేల
తెలిపితిఁ బో నాతి ♦ యలుకరెట్టింపఁగ
కలగుండు పడ నన్ను ♦ బలుక నేల
అంతతోఁ బోక మద్యమి ♦ మ్మంచువచ్చి
రచ్చవారెల్ల విన నన్ను ♦ రవ్వఁ బెట్టి
నెనరు గాన్పింప రాత్రిర ♦ మ్మనఁగ నేల
యేమి మోసంబో సుమశరా ♦ యీవె దిక్కు.

అయ్యో! యింకను రాత్రి యగుట కనుపించదు (ఆకాశమువంక చూచి) నామీఁదఁ బగగొనఁ బగలు నిలిచి యుండునేమో! యింక రాత్రియేకలుగదా! (అటు నిటు చూచుచున్నాఁడు) ఆహా! యీతోఁట యందమెంత బాగుగనున్నది.

సీ. నవనవోన్మేషప ♦ ల్లవవిభ్రమంబులు
కరతలసౌభాగ్య ♦ గరిమఁదనర
కలకలక్వణితకా ♦ కలికానినాదము
జిలిబిలిపలుకుల ♦ చెలువుజూప
కమనీయపుష్పగు ♦ చ్ఛములవృత్తములు
కులుకుగుబ్బలనీఁటు ♦ గులుకరింప
చంచరీకావళీ ♦ చంచద్విలాసంబు
బెళుకువాల్జూపుల ♦ విభవములర
లేతదీవలు నెమ్మేని ♦ లీలఁగ్రాలఁ
గుల్మలాభోగసంపద ♦ గొల్లగాఁగ
సుమపరాగమ్ము మెఱుపూత ♦ సొంపుగునింపఁ
జూడఁదగియుండె వనలక్ష్మి ♦ సువతికరణి.

ఎందుఁజూచిన నాసతి కన్నులం గట్టినట్లున్నయది. ఇంక నీయుద్యానవనవిహారంబు మారోద్దీపనోపహారంబు గాని కాలక్షేపసాధనంబు కాదు. (కొన్ని యడుగులు నడుచుచున్నాఁడు) అహా! యీ చంద్రకాంతశిలాకుట్టిమంబునఁ గొంతవడి విశ్రమించి యీవి నశేషంబపనయించెద (కూర్చొనుచున్నాఁడు)

ఉ. రాతిరివేళ నన్నొకని ♦ రమ్మనియెన్నటనాల యుమ్మసం
కేతముఁగాఁగఁ జెప్పెఁబరి ♦ కింపఁగ నీయది చూడ నాపయిం
బ్రీతియొసంగినట్టు లొక ♦ వీసము మోసముఁ జేయునేమొ య
ప్రీతియుఁదోఁచుచుండె విప ♦ రీతముఁగల్గినఁ గాదె యొద్దియున్.

హా! చెలీ! నీకై నేనెంత వెతలపడుచుంటిని. నాయాయాసంబెట్లపనయించెదవో; హా జగదేకసుందరీ!

(భార్యప్రవేశించును.)

భార్య—నాథా! యిదే వచ్చితిని నన్నుఁగన్నుఁబ్రామి యేకాంతముగా నీయుద్యానవనమున విహరించుట మీకుచితముగునా.

కీ—(స్వగతము) ఈమె నాసంగతి తెలిసికొనియే యిక్కడకు వచ్చినది. ఇప్పుడు నేను బొంకిన ఫలమేమి? బొంకిన నీమెనమ్మునా! నిజమేవచించెదను. (ప్రకాశముగా) రమణీ! నీవిందుల కేలవచ్చితివి?

భార్య—దేవా! దేవర సైరంధ్రివలపువలలం జిక్కువడి స్రుక్కి యిక్కడ నుందురని విని చింతాక్రాంతంబైన స్వాంతంబునం బొడముతహతహ నోపం జాలక దేవర కొక్కింత విన్నవింప వచ్చితి. కొంచెము దయచేసి నామనవి వినుండు; ఆమె నాకు సవతియౌనను నసూయచేం జెప్పుదానం గాను.

గీ. శుభములనుం గోరు మిమువంటి ♦ శుద్ధమతులు
కాంచ నొల్లరుగద కడ ♦ కంటనైన
పరవధూమణి ముద్దుల ♦ ఫాలతలము
చవితినాడొప్పు నెలవంక ♦ చందమునను.

కీ—సఖి! అది భీరుజనవిషయంబు గదా!

భార్య—

మ. అదిసైరంధ్రియు దాసి యాట నగుమ ♦ ర్యాదావిహీనమ్ము పె
ద్దది యాటర్ల సుతవంతురాలవుటచే ♦ నాయుఃక్షయంబౌట త
ప్పదు నీ కేటికి దాసి గోరుటమి చె ♦ ప్పన్విన్నవారెల్లన
వ్వుదురీ యల్పసుఖంబుం గోరి పరువం ♦ బున్వమ్ముం గావింతువే

కీ—అలలా! అది దాసియనుకొంటివిగా! పట్టమహిషులు దానింబోల గలరె?

భార్య—

శా. ప్రాణేశా వినునాదు విన్నపమునా ♦ పైనీదు చిత్తమ్ముగీ
ర్వాణాకాములు నాథు లేవురసిజె ♦ ప్పన్వ్యాంటి నాకోతికి
న్బ్రాణమ్ముల్వెసం గ్రుచ్చినట్టులయి నా ♦ భావంబు భేదిల్లెడు
న్నానెమ్మెన్నన కులమ్ము వన్నె చెడునో ♦ నాభాగ్యమెట్లున్నదో.

కీ—(కోపముతో) యేమేమి!

ఉ. నీతులు చెప్పవచ్చి కడు ♦ నిష్ఠురవల్బచరించి మెల్లఁగా
వాతలఁ బెట్టఁ జొచ్చితివి ♦ వవ్వరె! తత్పతు లేవురన్ననే
భీతిలువాఁడనే! యెఱుఁగ ♦ వే! మును నాదుభుజాబలంబు నీ
జాతిగుణంబిదే! చనువు ♦ నంగినఁ జయ్యన నెత్తికెక్కుటల్

ఛీ, ఛీ యేటిమాటలవి, నన్నుఁ బెదరింపవచ్చితివా! ఆయేలనాఁగకట నాథు లేవురుండిరట, వారసాధారణబాహుబలశాలురట, వారెల్ల ననుం జెనకఁ జూతురట, యిదియేనా! నీయభిప్రాయము. ఓహోహో! యేమి నీవాచాచాతురి! ఏమియీావగలు? ఏమి బెదరింపులు! ఏమిబిభీషికలు! ఏమియిచ్చకములు! ఇవియన్నియు నేనెఱుఁగనియవి కావు. దుడ్డుపేరుఁ జెప్పినంతనే తల పగులునను కొంటివా! వారెంతటివారైన నాబాహుపంజరంబునఁ జిక్కువరచి యయ్యేలనాఁగ నియ్యెడకుం దోడుకొని వచ్చి యయ్యైవిధంబుల నాచెలికి నీచే నూడిగంబుఁ జేయించెద; తొందరపడకుము (అని లేచిపోఁబోవును.)

భార్య—(పట్టుకొని) నాథా! నేనెన్ని చెప్పినను నాపలుకులన్నియు రోగార్తునకిచ్చు నౌషధంబుపగిది తమమదికి నసహ్యంబులైనవి. ఒకవేళ మీరు చెప్పినట్లు తత్పతులనియెడు గంధర్వులు నీభుజబలంబునఁ బరాజితులయ్యెదరనుకొందము. అట్లయినను.

ఉ. పాపమగుఁ బతివ్రతల ♦ పైమరులూనుట మున్నువాలితా
రాపరతంత్రుఁడై చెడఁడె ♦ రాజ్యము సైన్యము గోలుపోయి లం
కాపతి కానలోఁ జన ♦ క్ష్మాభుకూతురుఁ బ్రేమఁబట్టుట
స్వాపరెఁ గాదె బాంధవత ♦ సాభవమిత్రయుతంబుగాననిన్.

కావున పతివ్రతను బరాభవించుట మీవంటి ధర్మస్వరూపులకుఁ బాడిగాదు, నాయదృష్టమెట్లున్నదో! తనుగలిగివర్తింపుఁడు నేననుజ్ఞఁగొనియెదను (అని ఆకసము వంకఁ జూచుచున్నది.)

ఉ. చూచుము ప్రాణనాథ! తమి ♦ చొప్పడఁ దన్నెడఁబాయకుంత వె
న్నాడిన నన్ను గైకొనక ♦ నయ్యయొ యీాయినుఁ డేలవారుణిం

గూఢగఁ బోవుచుండెడిని ♦ ఘోరమటంచనివిన్నపింపమా
రాడఁడిదే మొయంచరుగ ♦ నన్యోన్యఛాయయసూయమీరఁగన్.

కంచుకి—(తెరలో)

శా. వాలమ్ముల్పయికెత్తి మందలయి యుం ♦ భారావముల్ మీఱఁగా
నాలింటింటికిఁ బర్వులెత్తెడిని సం ♦ ధ్యారాగముల్మ్రాకులం
దోలిం గావుల నారఁ గట్టినటులై ♦ యొప్పారె బక్షుల్ దివిన్
జాలై బారెకి సూర్యబింబరుచి శో ♦ ణంబయ్యె క్షీణపథ్యస్.

భార్య—

చ. వలచిన ఛాయఁ గైకొనక ♦ వావిరి బద్మిని యుంచుఁ దాగర
మ్ములఁ గిలిగింతఁ బెట్టుటనె ♦ పో వసుహీనత వచ్చె డీకి
న్వాలియయిత్రిం గదా! యనుచు ♦ వేవెలుఁగంతయు శోకవార్ధిలో
పల మునుఁగాడెనాఁ జరమవారిధిఁ ♦ గ్రుంకెనుహీనకాంతియై.

కీ—గీ. తమ్ములకు సూఁడు నెరిజింక ♦ తాల్పకాఁడు
జక్కలకు రేఁడు వేవెల్గుఁ ♦ జోదుజోఁడు
లచ్చి సైదోఁడు ♦ తెరగంట్లునెచ్చెఁగాఁడు
తొగలయెకిమీఁడు క్రుంకెను ♦ మగువచూడు.

నన్ను వేధించుచున్న నీ గ్రహద్వయమ్ము నస్తమించె.

మ. హరిరత్నద్యుతి నేలి కాలగళకం ♦ ఠాభీషుబుం బోలి బం
ధుర నీలోత్పలకాళిమం బునుఁదిసం ♦ తుల్గొట్టి ప్రావృట్పయో
ధర కాంతిచ్ఛటఁ గొల్లవెట్టి యతిసాం ♦ ద్రంబై తమఃపూరము
ల్సొరిదిన్నాభిమిన భూంతరమ్ములలమె ♦ న్సూచీముఖాభేద్యమై.

నాయుద్యమంబున కనుకూలమైయున్నమన్ను గానబడకుండ గాఢాంధకారము తటస్థించినది యింక నేనిప్పుడే వలయు మధురపదార్థంబులను గొని పోయి యాయొప్పులకుప్పం గూడి సుఖించెద.

(అందరు నిష్క్రమించిరి.)

---

శ్రీశారదాంబాయైనమః

# కీచకవధ.



సప్తమాంకము.



ద్రౌ—ఆర్యపుత్రా! కీచకుఁడు వచ్చుసమయము కావచ్చినది. మీయన్నదమ్ములు మీకుఁబాసటగావత్తురు.

భీ—(అనాకర్ణితముగా) మఃమీనర్తనాగారంబు తేజోవిహీనమ్ముఁ గావించి యిందు గూఢముగా నుండుదము. నీవీతెరచాటుననుండిచూచుచుండుము. నేనిందు బవ్వళించెద.

ద్రౌ—చిత్తము.

భీ—నిజముగా వాఁడు వచ్చునా!

ద్రౌ—ఏలరాకుండును.

భీ—గీ. మన్మథానలదందహ్య ♦ మాన మాన
సుఁడుకావున నేఁడు రా ♦ కుండఁడతఁడు
కాముకులకేఁడ తాలిమి ♦ కలుగు నేఁడ
కలుగుఁగాకది నిలుకడఁ ♦ గాంచునేఁడ

(తెరలో కాలిచప్పుడు)

ద్రౌ—అడుగో వచ్చుచున్నవాఁడు. మనము యథాస్థితముగా నుండుదము.

(ఇది విష్కంభము.)



రంగము — నర్తనశాల.

(కీచకుడు మధురపదార్థములపళ్లెముతో ప్రవేశించుచున్నాడు.)

అహో! నే డేమి నాయెడమకన్ను దరుచున్నది. మనోజవమే కార్యానుకూలముగా మాండవ్యమతప్రోక్తమైయున్నది. నేనెప్పుడును మాండవ్యమతావలంబుడనే గదా! నేడు మాత్ర మీ సందేహ మేల? (తెరవంక జూచుచున్నాడు) యిదియే నర్తనాగారము. యమాగారమువలె నున్నదే? (ఆలోచించి) ఏమిది నాకీయుపమానాశంక! (ధైర్యముతో) బలవంతుడనగు నాకిది యమాగారమైననేమి! ఓహో! యిది మహారణ్యంబుపగిది నిర్మనుష్యంబును దుర్గమంబునై గ్రీష్మకాలంబు కరణి నపగతప్రకాశంబై యున్నది. (అటు నిటు తిరుగుచున్నాడు) పాపాత్ములకు స్వర్గద్వారంబు చందంబున దీనిముఖద్వారంబు నాకుఁ గనపడదేమి అమ్మయ్యా! యిదిగో దొరికినది (లోపలికిఁ బ్రవేశింపబోయి తలపట్టుకొని వెనుకకు వచ్చును) అబ్బా! యిదివరకెన్నిసారులో చూచితిని కుడ్యకారులు కవాట ప్రాయముగా తమశిల్పనైపుణ్యంబున గరుడపచ్చలతో నిర్మించిరి. ఇదివఱకు నామొగమున కెన్నిసారులో తగిలి నా నెత్తురంతయు బొప్పి గట్టి కాయలు కాచినది. కావున నేడంత వేధించలేదు. ఇదియేకొత్తయైనచో పరాభవమే. ఆ, జ్ఞాపకమువచ్చినది. యీప్రక్కనుగుమ్మము లెక్కడివి దీనికి తూర్పున నొక్కటేగుమ్మము. అటుబోయి ప్రవేశింతును. (అని యింకొక వైపునకుఁ బోయి చేతితో వెదకుచున్నాడు.) ఇదియే గుమ్మము దీనితలుపు వేసి యున్నదే? (చేతితో గెంటును.) ప్రాణేశ్వరీ! (అని మెల్లఁగాఁబిలుచును.) ఆమె యిక్కడకువచ్చి యున్నదో లేదో అలుకుఁడేమియును లేదు. నన్ను మోసముచేయునా — చేయదు. ఎందున్నదో? (చేతితో గోడపైతడుముచు) ఇదిగో నాచెలి. మునుసిగ్గుచే మోము వంచుకొని

యుండుటచేతఁ దేరిపారఁ జూడలేదు. ఇప్పుడు చీఁకటిగా నుండుటచేత స్పష్టముగాఁ గనఁబడుటలేదు.

క. కమలముల నేలి రాకా
కుముదప్రియుఁ బోలి ముద్దు ♦ గులుకుచు నెంతే
కమనీయంబయి కననీ
రమణీమణి నగుమొగంబు ♦ ప్రమదంబొసగున్.

సఖీ! ఇంకను సిగ్గుపడుచుంటివా (ముద్దుపెట్టుకొని వెనుకకువచ్చి) ఛీ! ఇది ప్రియురాలి మోముకాదు (చేతితో తడుముచు) కరచరణాద్యవయవము లేవియు లేవు. ఇది శిల్ప్యాలంకారముగా శిల్పివరేణ్యులచే రచియింపఁబడిన కీలాముఖము. అయ్యో! నేనెంత తెలివిమాలినవాఁడను. నిత్యము జూచుదానినే పోల్పలేకపోతిని. ఈమె చూచిన నేమనుకొనునో సఖీ! నాకింటిసంకేతమని జెప్పి నన్నుఁ గన్నుబ్రామెదవా? ఈమారు బాగుగ పరిశీలించెదను. (ఇంకొక వైపునకుఁ బోవుచున్నాఁడు.) ప్రియురాలా? దొరికితివే ఇఁక నీవెందుఁబోఁగలవు పోయినను కీచకుఁడు పోనిచ్చునా (స్వగతము) ఈలేమను పలుకరించక యే గాఢముగా గౌఁగలించికొనియెదను. (శిలావిగ్రహమును పట్టుకొని గాఢాలింగనము చేసికొని వెనుకకువచ్చి) అబ్బా! నాకఠినమైన వక్షస్థలము నొచ్చి తిమ్మిరిపట్టినయట్లున్నది. ఇది మాలినిగాదేమో? గంధర్వుల భార్యనని చెప్పినది. నన్ను వంచించుటకిట్లు కామరూపము ధరించినదేమో! ఇట్లు నన్ను నమ్మించి మోసపుచ్చునా! కొందఱి స్త్రీలశరీరములును కఠినముగానుండును ఇంకొకసారి పట్టిచూచెదను (మరల పట్టుకొనఁబోయి క్రిందపడిన పుస్తకమును జేతితోఁ బట్టుకొనుచున్నాఁడు.) ఛీ! ఛీ! యెంతనిర్భాగ్యుఁడను. ఇది శిలామయంబగు పాంచాలిక. ఉత్తర మొదలగు కన్నెలు సంగీతకళాభ్యాసమును చాలించి పుస్తకము నిందుంచిపోయిరి. ఇదియు సత్యమున్,

జూచుచున్నదియే. ఇఁకఁగోడదం వెదకిన నిట్టులేకనబడును. నేనిందు కూర్చుండి యాతలోదరిం బిలిచెద. రమణీ.

చ. నరనపదార్థముల్గముద్ర ♦ శస్త్రమణీమయ భూషణావళుల్,
మురువగుఁజిల్గుఁదువ్వలువ ♦ లున్నవదర్శనముఁగొంచువచ్చిని
న్నరయుచునుంటిఁ గానబడ ♦ వయ్యెయియొ యెయ్యెడ కేగినావొ? నే
న్నరనిమిషంబు నోర్వనియ ♦ డంగజుఁ డో గజరాజగామినీ.

చ. నినుఁ గనుఁగొన్న యన్నువను ♦ నమ్మ త్రసఁదక్కొరులెక్కఁ జేయునే
ననవిలుకాని బారిఁబడు ♦ నాదు విలాసము లెంచునింతి నే
నను నునుఁబల్కు లెల్లయురు ♦ లైయలయించునుఁగాంతస్వాంతము
స్వాజదళాక్షి నీపిటుల ♦ నన్నలయించెద వేమనందగున్.

భీ—(స్త్రీ స్వరముతో) నీవెంతటివాఁడవుఁ గాకుండిన నిన్ను నీవు పొగడుకొనియెదవా?

కీ—(ధ్వని నాఁకించి తనలో) యీధ్వని యీదెసనుండి వచ్చిన యటు లున్నది. ఇటు బోయెదను. (ప్రకాశముగా సంతోషముతో) సఖీ! వచ్చితివా? నాపైదయగలదానా? నన్ను నేను బొగడుకొనుటఁ గాదు సుమీ నిజమే చెప్పెదను.

ఉ. నీను పదారవిందముల ♦ నిత్యముఁగొల్చుట నాకు భాగ్యసం
పాదన కాదె, నన్నుఁ బెఱ ♦ వారిఁగఁ జూడఁగ నేల, కల్మిక్రిం
బాదగు జీవనమ్ముఁ బరి ♦ పాలనఁ జేయుము నీవ, వీటిలోఁ
బైదలు లెల్ల నిన్నుఁగొలు ♦ వందగు కట్టడి యాచరించెదన్.

ద్రౌ—(తనలో) యీదుర్మార్గుఁడు నాదిక్కునకు రాఁడుగదా?

భీ—ఛీ ఛీ! భగినీభాగ్యజీవండవైయుండి యింకసిగ్గులేక ప్రేలఁదొడంగెదవా?

కీ—(మరల చెవియొగ్గి ధ్వని నాలకించి) ఈమారు ధ్వని యీదిక్కునుండి వచ్చుచున్నది. అటు బోయెద (పోవుచు కాళ్ళను

నీపయంత్రము తగిలి బోరగిలఁబడుచున్నాఁడు) (లేచి సిగ్గుతో) (ప్రకాశముగా) సఖీ! సుధేష్ణ యింటి దాసుఁడనన్న కొంటివా!

ఉ. నాబుజశక్తిచే ధరణి ♦ నాథులఁ బోరుల గెల్చి సర్వథా
శ్రీ భృతి సల్పుచుండుదు మ ♦ దీయవిభుత్వము నెల్లవారు శీ
ర్షాభరణమ్ముగాఁ గొనఁగ ♦ నల్లవిరాటు నధీనమైన యీ
వైభవమెల్ల నావలన ♦ వచ్చెను గాదె సరోరుహాననా.

(భీముని సమీపమునకుఁ బోయి పట్టుకొనబోవును.)

భీ—(చెయ్యి విదల్చుకొని) ఛీ! ఛీ! తులువా?

క. నావంటియువిద నెన్నఁడు
నీవెఱుఁగవురోరి నీచ ♦ నీదగుమైన
న్నావంతసోకెనే నీ
చేవంతయుఁ జెడును చావు ♦ సిద్ధమునుమ్మా.

కీచకా? నీవు నన్నంటితివేని నీమేన ప్రాణంబులుండవు. ఇఁకనీవెన్నడును నతులనంటవు. యముని యింట బుట్టువుకుంగాగలవు. (అని మెడబట్టివంచును.)

కీచ—(స్వగతము) ఇది మాలిని గాదు. గంధర్వకోపానలకీలయేమో! కీలయేల? నిజముగాగంధర్వుతేమో! (ప్రకాశముగా) అమ్మో! అమ్మో! అతివినయా! అతివినయ!

క. నిరుపేదవాఁడవని కని
కరమొదవగ సతతఁబు ♦ గసిప్పెట్టెదు నా
కురిఁ దెచ్చి పెట్టితివహా
పరి తిను నింటికిని గీఁడు ♦ బరుమట లివియే.

హాని నేల నిఁడింవవలెను. ఆమె పతివ్రతసుమాయని సాటి చెప్పినోమె నిదియుంతయు నానిర్భాగ్యతగాని వేరొండుగాదు.

గీ. పరవధూమణిఁ గూడుట ♦ దురితమనుచు
నొక్క వచియించె మున్ను మా ♦ యక్క పిదప
కట్టుకొన్నది గట్టిగా ♦ మట్టుఁబలికె
ద్రోసి వైచితి నాకొంప ♦ దీసికొంటి.

(తనలో) ఇంకిపుడు జేల తనమేల (ప్రకాశముగా) మహానుభావా! నీవెవ్వండవో కరుణించి తెలుపుము.

భీ—(స్వగతము) నన్ను వీఁడు పేరడుగుచున్నవాఁడు. ఏమి చేయదలంచెనో యెరిగించినచో నిప్పుడుచచ్చు వీనివలన భయమేమి. (ప్రకాశముగా)

శా. దూరం బోయెను మృత్యువక్త్రమునయం ♦ దుర్జ్ఞానువేవ్వన్నచూ
ఘోరంగాల్చెదె మానవాధమ మహా ♦ భూతగ్రహోచ్చాటనో
దారవ్యక్షురభీమ నామమనురు ♦ తైంసాధిదైవంబనో
క్రూరాచారక యేమిచేసెదవు సం ♦ కోచంబు చల్లారెనే.

కీ—(స్వగతము) వీఁడు భీముఁడా! యెక్కడి భీముడు—అడవులకుఁబోయిన వాఁడిక్కడికెట్లు రాగలఁడు నన్నుఁ బెదరింప నిట్లనుచున్నాఁడు. (ప్రకాశముగా)

ఉ. పాపియటంచుఁ జూడక, భ ♦ వత్పదయుగ్మము లాశ్రయింతునా
దీపము వెల్గులోని కవ ♦ దెమ్మట నీమహనీయరూపమున్
జూపుమి యొక్కమారు నిఁకఁ ♦ జూతు నెవండవు నామనంబు సం
తాపము వాపి తోచినవి ♦ ధమ్మునఁ జేయుమ జేవ విక్రమా.

భీ—(స్వగతము) వీఁడు వెలుఁగున నన్నుఁ జూడగోరుచున్నవాఁడు. వీఁడు నన్నుఁజూచిన నిక్కంబుగ తెలిసికొనజాలునా! వలలుఁడనిగా గుర్తింపగలఁడు. నిజముగా దెలిసికొనినను వీఁడు జీవించియుండినగదా భయపడవలసినది. వీనిని బ్రాణములతో విడుతునా? (ప్రకాశముగా) కీచకా! నన్నుజూడదలచితివిగా.

ద్రౌ—ఆర్యపుత్రా! వెలుగు గావించెద నుండుము. (దీపము వెలిగించును.)

కీ—(ద్రౌపదిం జూచి) అమ్మా నీవు ద్రౌపదివా! తెలియక పాపంబున కొడిగట్టిన యిప్పుడు నిప్పట్టున రక్షించి ప్రాణరక్షణ సుకృతంబును బొందుము.

ద్రౌ—నిన్ను జంపించి జగద్రక్షణంబు జేయించెద.

కీ—(భీము నెగదిగం జూచుచు స్వగతము) వీడు భీముడా! నిన్న మల్లునితో నెదిరి జయంబు వడసిన మనవలలుడు వీడు మాయక్కగారియింటివంటలవాడు వీనిని సూత్రిము జయింపగలనా! బ్రతిమాలుకొని యాపలకు నడిపించి యెట్లయినం బారిపోయెదను. అట్లోడంబడ జేసి నల్లరిం జేసి యందరికిం దెలిపి క్రమ్మర నెప్పటియట్లు కానపాలుం గావించెద. (ప్రకాశముగా)

శా. నాయాప్తుండవు మీయింట నిత్యమును వం ♦ టల్ జేయనీక్షింతురి
న్నోయీ! యేగతినిట్టులూరకయున ♦ న్నన్నెత్తుగాం జంపగాం
జేయాడుం జెవుమోయి నన్వేడుము మేల్ ♦ సేనాదంగాం జేతునా
కాయత్తంబగు మత్స్యరాజ్యరమ యుం ♦ దదర్థంబునీకిచ్చెదన్.

ఛీ, ఛీ, పారుపోతా! నీవిచ్చువాడవును నేనుకొనువాడనునా! నీవంటిఖలుని విడచిన జగమ్మున కపకారంబుగాని యుపకారంబు కానేరదు. కాన నిన్నిప్పుడే యమగృహాతిథిం జేసెద.

కీ—(స్వగతము) పారిపోయెద నన్నను విడిచి పెట్టండాయెను; వీనినేనెదిరి జయింప లేను. వీని మనసు నొవ్వనాడి యవ్వలకుం గొనిపోయెద. (ప్రకాశముగా) దేవా! నేనింక నీచేతం జిక్కువడితిని గదా! నీవేమిజేసినం నీకడ్డియుండనే. నీవును ధర్మవేదివి నన్నుం జంపం దలంచితివి. కాన సమప్రదేశంబునకుం బోవుదము రమ్ము. నేను

పారిపోయెదనని తలంపకుము నేను నీవలన నెట్లుమనం జవచ్చువాఁడనే. పగరకు వెన్నిచ్చి కాందిశీకుఁడై పలాయనమొనర్చిన వానికి దుర్గతి యగునని పెద్దలు సెప్పుదురు. కావునఁ జేతిలావెక్కుడంత నెరపం దలంచితి నీవును ధర్మవిరుద్ధంబునకు సంశయించువాఁడవు గదా!

ద్రౌ—ఆర్యపుత్రా! ఈతఁడు మోసపుచ్చి పారిపోఁగలఁడు. ఈతండు పతివ్రతల పాలింటికి ధూమకేతువు వీనిఁ గరుణించి విడిచెదరు జూడీ!

భీ—రమణీ! వీని ప్రాణములతో విడుతు ననుకొంటివా? చావనున్నవీని కోరిక కూడ చెల్లించి వధియించి వేగ వచ్చెదను. నీవిచ్చటనే యుండుము.

ద్రౌ—నాథా! నీకు నవగ్రహంబు లనుకూలింతురుఁగాత. హరివరదుండు నీయెడ కృపాళుండగుఁగాత. నీకు జయంబగుఁగాత.

(భీముఁడు కీచకునితో నిష్క్రమించును)

ద్రౌ—(కన్నులనీరుఁ గార్చుచు) హా పరమేశ్వరా! నన్నీ క్షితిఁ బుట్టువుఁబుట్టించి పుట్టినయిల్లు నత్తయిల్లుఁ గాక కానలపాలు గావించి పడరానిపాటులఁ బరపించి పరగృహావాసంబనుసంధించి యిందునుఁ గొఱగాని వరభ్రష్టమ్ముల కిరవుపరచితివా! నావలన మహానుభావులకుం గూడ నిడుమలుబొడమె. ఇప్పుడీకీచకునింజంపఁబోయి యీతండేమిగావలెనో, నేనొంటరిగానుంటి, నాకేమి కానున్నదో? దైవమా! (అని విచారించును.)

(ధర్మరాజు ప్రవేశించును.)

ద్రౌ—ఆర్యపుత్రా! సభాంతరాళమ్మున నన్నుఁ బరాభవించిన కీచకాపశదుం జంప శంకించిన మీతమ్ముని నన్యాపదేశవచనరచనాపాటవంబున మీరట్లు వారించుటకుఁ దేవరయెడ నేనేమియపరాధంబొనర్చితిని. (విచారించును.)

ధ—ఆర్యురాలా! సమయభంగమ్మగునని వెఱచి నేనట్లుంటిఁ గాని నీయెడ నొకతప్పు కలిగి కాదు.

(అర్జునుఁడు ప్రవేశించును.)

ద్రౌ—(కోపముతో)

శా. ఆషండంబోడిమి పూని షాకృతియుఁగా ♦ కంఠఃపురంబందున
య్యాశుంబిడ్డలకాటపాటలను నీవ ♦ శ్రాంతము నేర్పుచున్
జూడాపుష్పము వాఁడ నీవుగదచ ♦ చ్చెంగాకపాంచాలియే
జాడంబోయిన నేకొ అంతయని నీ ♦ చందంబు, మేలయ్యెఁ గుణా.

నేఁడు మందహాసంబుఁ జేయుచుం జూడవచ్చితివా!

అ—(చిన్నబోయిన మోముతో) ఆర్యురాలా! నిగర్భకష్టముగు నీయాకృతియున్న నాదుఃఖ మెవ్వరితోఁ జెప్పుకొందును.

ద్రౌ—నీ తెఱఁగు నేనెఱుంగనిదానఁగాను. ఇప్పట్లనీవిట్లుండుట నాకు సంప్రియంబే.

(నకులుఁడు ప్రవేశించును.)

న—దేవి! కీచకునివలన నేకీఁడును బొరయకుండఁ గాపాఁడబడితివి గదా!

ద్రౌ—ఎవరివలన, మీవలననా! మీయన్నగారివలననా?

న—మాయన్నవలన.

ద్రౌ—నిజమే. ఆయన యింతవరకు సుఖనిద్రలో నుండుటవలన లేకుండిన నేఁడుమాత్రము, నిసర్గభూతదయాళుత్వమునుఁ గనపర్చకపోవునా?

న—(తనలో) ధర్మజుపై నాగ్రహమ్మున నిట్లనుచున్నది కాఁబోలు. (ప్రకాశముగా) కాదు. భీమసేనునివలన.

ద్రౌ—అమ్మహానీయుఁడును మీవలెనూరకున్నచో నేనీపాటికిఁ గృతార్థురాలనే యగుదును, అదియును తమమదికి నసహ్యమైనది కాఁబోలును.

(సహదేవుఁడు ప్రవేశించును.)

ద్రౌ—ఆర్యపుత్రా! నిన్నుఁ జూచిననాకుఁ గడుపు చెఱువగుచున్నయది. కీచకనిర్జయపు దోడ్పడలేదని నిన్ను నే నేమనంగలను.

సహ—ఆర్యురాలా! ఈచిరుతకార్యమునకు మేముఁ గూడ వలయునా? నీ నియమించిన యమ్మహాసీయుఁ డొక్కఁడ చాలఁడె?

ద్రౌ—ఆర్యపుత్రులారా! అమ్మహానుభావుండరిగి పెద్దయుం బ్రొద్దయినట్లున్నది. ఇంతయాలస్యంబునకుఁ గారణంబూహింపఁజాలకున్నదాన. (విచారించును.)

(భీముఁడు ప్రవేశించును.)

ద్రౌ—ఆర్యపుత్రా! నన్నుఁ బరాభవించినయన్నీచుండు చచ్చెనా!

భీ—దేవీ! పంచోత్తరశతసంఖ్యాకులగు తమ్ములతోఁ గూడఁ గీచకుండు తెగటారె.

ధ—తమ్ముఁడా! యుపకీచకులఁ గూడ వధియింపవలసివచ్చెనా!

భీ—అన్నయ్యా! కీచకునితో నట్లు నేను సమ్ప్రదేశమునకుం జని యందు మేమొండొరులు మెయిమెయిదాకించి సమయభంగమునకు నేనును గొండొకకారణంబున వాఁడును శంకింపుచుఁ బెద్దయుం బ్రొద్దుపోయినతరి నతఁడు హీనబలుఁగా నెఱింగి వికృతవధఁ జేయఁదలంపునం బంచాస్యంబేణశాబకంబుం బొదువుగతి నుదగ్రశక్తి సముద్ధతుండనై యాతనిమస్తకంబును బీనసత్తుగ భుజశాఖలును జరణయుగంబుతో మేలోనిముడ నగ్గుగాఁ జొనిపి రెండుచేతులఁబుయికెత్తి పల్లవితకుసుమితఫలితలలితంబగు తరువరంబును మత్తమాతంగంబు కూల్చుకరణి బహువిధవిచిత్రరుచిరరత్నవిభూషణభూషితంబైన యాతనిశరీరంబు నిండించిన కండల తిత్తియన నేలంబడవైచితి. ఆదురాత్ముండును వెడబొబ్బవెట్టుచు నసురుసురనుచు నసువులం దొఱఁగె. నేనును భోజనశాల విడిచి వచ్చుచుండఁ దత్సహోదరులార్పుచుఁ గో

క్కను నిలు; నిలు, పోకు, పోకుమని సముదగ్రవీరాలాపంబులు నింగి ముట్ట నదలించుచు బెదరించుచు బలువుమిగిలి మగతనంబునం గడి కోనికడిమి మెరసి నన్ను దలపడి యెదిరిన నేనును విసువక నొక్కని నొక్క వ్రేటున మరియొక్కని నొక్కపోటున వేఱొక్కని నొక్కము ష్టిఘాతమ్మున నొండొక్కని గదాఘాతమ్మున నందఱి నన్నివిధంబుల మెడలు విఱిచియుఁ దొడలు తఱిచియు ముక్కులు చిదిపియు బొక్క లు కదిపియు, వీపులు పగిల్చియు, మూపులు నొగిల్చియు, నెత్తుట రత్తమిల్లి ముక్కముక్కలగు లక్కబొమ్మల తెఱంగునఁ గావించుట యు చాపకట్టువడి పీనుంగుపెంటలంబారు రుధిరతరంగిణీ ప్రవాహం బుల నోలలాడుశాకినీఢాకినీ పిశాచగణంబుల వైతాళంబులు చూడ బీభత్సంబుగా కనుపట్టె నివ్విధమున నుపకీచకుల నన్నతో యమపు రంబున కనిపివచ్చితి.

ము. మదిసంతాపము వాసెనే! గురుతరా ♦ మర్షంబుచల్లారెనే?
ముదముంబొందితె మామకోద్ధతభుజా ♦ భూరిప్రతాపంబు మె
చ్చొదవంజాలెనె? యట్టినిన్నటులఁగీ ♦ డొందించియున్నీచుమృ
త్యుచ్ఛేదంబెందకయుండశక్యమటె! రు ♦ ద్రుండడ్డమైనన్సతీ!

ద్రౌ—(సంతోషముతో)

మ. అలుకంబూనియుశాంతిఁజెదితివిని ♦ న్నాకొల్వులోనేఁడుబ
ల్చెలమెప్పంబ్రజఁగన్నుఁబ్రామికులదా ♦ శ్చారిత్రునింబట్టితె
మ్మింతోఁజంపితివొక్కయుండవెనుమా ♦ మోహాబ్ధిలోమున్గితిన్
ఖలులంగౌరవులన్వధించియెపుడా ♦ నందంబునందింతువో.

(ధర్మరాజాదులంజూచి) ఆర్యులారా.

సీ. భావిసుమోధనాదికుస ♦ పాంసహింసననాటకాంగనాం
దీవిధిసూత్రధారసము ♦ దీర్ణతఁగీచకునిన్వధించి ప్ర

స్థావనగాఁదదీయసహ ♦ జాతులఁగూల్చెఁ దండువేఁగ ప్ర
జ్ఞావశవృత్తులై చనఁ బ్రతి ♦ జ్ఞల్నెఱవేర్పఁడు మీఱలెల్లఱున్.

నకు—(ధర్మరాజుంజూచి) ఈకట్టియదృష్ట మెన్నఁడయినఁ దారసిల్లునా? అన్నయ్యా.

ధ—(అనాకర్ణితముగా) ద్రౌపదిపై చేయివైచి. ఆర్యురాలా!

సీ. తనకుఁ బెల్లాపద ♦ తారసిల్లినయప్డు
ధైర్యంబునాత్మలోఁ ♦ దాల్చుటొకటి
కోడికాంతలకుఁ జేఁ ♦ దోఁడువాదోఁడుగాఁ
బడసినగతిసాయ ♦ పడుటయొకటి
ఖలులబారిబండి ♦ గాఱియఁబొందియు
దనమానముసుఁగాచి ♦ కొనుటయొకటి
ప్రాణగొడ్డ బగు ♦ పవిత్రమైనఁబతియాన
విడుమఱలేక కా ♦ వించుటొకటి
పూర్వభవపుణ్యపరిపాక ♦ మునవెగాని
గలుగనేరవునీయందె ♦ గలిగెనన్ని
నిన్నుఁబురడించుసతులచే ♦ వన్నెగాంచి
లలనభారతమాతరా ♦ జిల్లెడుఁగాత.

ఇంకనీ యజ్ఞాతవాసంబు కొంచెము కొలంతగా నంతయుఁ జెల్లించితిమి. ఈకొలంత తీరినసకలంబును సన్నిహితంబుగాఁదలంపుఁడు. తమ్ములారా! మనకింతకంటె ప్రియమెద్ది కావలయును. అయిన నిట్లగుఁగాక.

భరతవాక్యము.

ఉ. సంతతవైభవంబులనె ♦ సంగుచున్న స్వరాష్ట్రమందు ఖం
డాంతరవాసులైనను మ ♦ తాంతరసంస్థితులైన నెవ్వరే

ప్రాంతములందునెట్టిసుఖ ♦ మాత్మనెఱుంగకదుఃఖభాజులై
వంతలఁబొందుచుండుదురొ ♦ వారిమహీపతిప్రోచుటొప్పగున్.

ఆకల్పంబుగయావతంబుపతిసే ♦ వాయత్తమైకలిత్రికిం
బ్రాకౌఁగాతధరాధినేతచరమో ♦ పాయంబులేకుర్వరం
బ్రాకుంగావుతసంస్కృతాంధ్రకవితా ♦ సామ్రాజ్యముల్లగ్గిగా
రీకళ్యాణములన్నివ్రజాయతనము ♦ శ్రీబిూజిరాణింపుతన్.

సంపూర్ణము.

## పెద్దాపుర సంస్థాన చరిత్రము.

పెద్దాపురము, విజయనగరము, మొగలతుర్రు మున్నగు క్షత్రియుల పూర్వచారిత్రము కరతలామలకము. పెద్దాపుర పుస్తక సంపాదనవిషయము, విజయనగరములో పూనపాటివారికిని వత్స యివారికి కోడిపందెములపట్టుదలలు, చుండూరు, రాజానగరం, మహేంద్రవరము, పెద్దాపురము మున్నగు అనేకస్థలములయందు గిన యుద్ధవిశేషములు విపులముగ దెలుపబడినవి. వెల 0—10—

## లలితకుమారి.

హిందూదేశచరిత్రవిషయక నవల. నవలలకుండవలసిన పా చిత్యము. శృంగారరసము కనపర్చబడినది. వేయేల గ్రంథము చ నారంభించిన ముగించువరకు విడువనొల్లరు అతిసుందరము, వ సుబ్బారావుగారిచే వ్రాయబడినది. 0—10—

## శ్రీదేవి.

పెద్దాపురసంస్థానవిషయకనవల విజయనగరం పెద్దాపుర స్థానముల మర్యాదలు గౌరవవిశేషములు ఇందుమనోహరముగ పబడినవి. వెల 0—8—0

మహాత్మాగాంధిగారి ఆరోగ్యదిగ్దర్శని ప్రతివారుతప్పక చ వలసినది. 0—10—

## కర్ణసామ్రాజ్యము.

ఆంధ్రదేశమునకు సంబంధించిన రెండవశతాబ్దముదాటి ఆం చరిత్రవిషయికనవల చిలుకూరి వీరభద్రరావుగారిచే వ్రాయబడి కర్ణునిసామ్రాజ్యవైభవము పూర్వపుఆంధ్రుల ధైర్యసాహసములు ప పబడినవి. 1—0—